


# ఐక్యఉపాధ్యాయ

THE LARGEST CIRCULATED TELUGU EDUCATIONAL MONTHLY



చిన్ని చిన్ని పాపల్లారా చిరునవ్వుల మొగ్గల్లారా
ఆడుతు పాడుతు అడుగెయండి అధ్యయనానికి బడకెళ్లండి

జూన్ - 1994
వెల రు 3-00

సంపుట - 20
సంచిక - 6

ఆంధ్రప్రదేశ్ ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్
అధికార పత్రిక

V.S. PRAKASH

CI

## పాఠకుల అభిప్రాయాలు

మే సంచికలో కార్టూను, సంపాదకీయం ఎయిడెడ్ ఉపాధ్యాయుల జీతాల గురించి వివరంగా తెలియజేశారు. నిజంగా బాధకల్గుతున్నది. ఎ. దయాకర్, వరంగల్

పత్రికలో ఆలోచించండి మీకు తెలుసా చాల బాగున్నాయి. డా॥ వై. రాధాకృష్ణమూర్తి గారి భారత దేశ ఆర్థిక పరిస్థితులు ఉపయోగకరంగా వుంది.

ఎ. శ్రీనివాస భద్రాచలం

చెప్పండి చూద్దాం జవాబులు తర్వాత సంచికలో అన్నారు. ప్రచురించలేదు. ఇక్కడ ) చుక్కలు వున్నాయి అన్నారు చుక్కలు లేవు. జవాబులు ప్రచురించాలి. మరచిపోవద్దు.

బి. మోక్షానందం ప్రగడవరం

1994 ఏప్రిలు పత్రిక చిన్న అక్షరాలతో ప్రచురించారు. చూపుతక్కువగుటచే మాకు కనిపించుట లేదు. కాస్త పెద్ద అక్షరాలు వ్రాయండి.

బి. ప్రకాశరావు, పెనుగొలను

మే నెల ఐక్య ఉపాధ్యాయ పత్రికలో అచ్చు తప్పులు చాల వున్నాయి. ఇవి లేకుండా చూడండి.

ఎ. కేశవులు, గూడూరు

ప్రశ్నోత్తరాలు రామిరెడ్డిగారు బాగా వ్రాశారు. మనము - మన ఆరోగ్య బాగుంటుంది.

ఆర్.కె. యల్. సూర్యనారాయణ
జయగౌరి శంకర్

"విమర్శ ఎలా వుండాలి? అని శ్రీ బి. నరశింహారావు ఏప్రిల్ 94 సంచికలో వ్రాసిన వ్యాసం వివాదాస్పదంగా వుంది.

శ్రీమతి రమాదేవి కొన్ని విషయాలను ప్రస్తావించకుండా వదిలివేసి వుండవచ్చు. ఆ విషయాలను సహేతుకముగా విమర్శించి శ్రీ బి. నరసింహారావు పాఠ్యగ్రంధాలపై సాగుతున్న విమర్శను పరిపుష్టం చేసి వుండవలసింది. అలాగాక రమాదేవి గారి వ్యవహారిక శైలిలో తప్పులు వెదకటానికి ప్రయత్నించడం తగని పని.

- చెన్నమాధవుని రమాదేవి (కరీంనగర్)

మే పత్రికలో కార్టూన్లు చాలా బాగుంది. సంపాదకీయం డి.ఇ.ఓ. ఆఫీసు వ్యవహారాలు కళ్లకుకట్టింది.

- వై. మాలకొండయ్య టిలిపాకం

శ్రీమతి రమాదేవిగారి వ్యాసాలలోని విషయానికి ప్రాధాన్యత నివ్వకుండా భాషాపరమైన చిన్న పొరపాట్లను, అచ్చుతప్పులను శ్రీ బి. నరసింహారావు భూతద్దంలో చూడటం సమంజసం కాదు.

జి. శ్రీమన్నారాయణ, పినపాక

## అమర జీవులకు అశ్రుతర్పణ



ఎ.పి.టి.యఫ్ రాష్ట్ర మాజీ అధ్యక్షులు శ్రీ ఎం. నరసింహ స్వామి 1994 మే 21 న మరణించారు. వీరు తూర్పు గోదావరి జిల్లా శాఖ అధ్యక్షులుగా ప్రధాన కార్యదర్శిగా చాలాకాలం పనిచేశారు. రాష్ట్ర కార్యవర్గ సభ్యునిగా, ఉపాధ్యక్షులుగా ఎంతోకాలం పనిచేశారు. లక్ష్మయ్యగారి మరణం తర్వాత, రాష్ట్రఅధ్యక్షులుగా పనిచేశారు. ఉపాధ్యాయులకు సేవలు చేసి, మానేజిమెంట్లుచే అనేక ఇబ్బందులకు గురైనారు.

వారికి భార్య, ఇద్దరు కుమారులు, ఇద్దరు కుమార్తెలు వున్నారు. వారి మరణానికి యు.టి.యఫ్. తీవ్రసంతాపాన్ని ప్రకటిస్తూ వారి కుటుంబ సభ్యులకు ప్రగాఢ సానుభూతిని తెల్పుతున్నాము.



యు.టి.యఫ్. నెల్లూరు జిల్లా శాఖ కార్యదర్శివర్గ సభ్యులు శ్రీ. పి. జె. ప్రభాకరరావు 10-5-94 న క్యాన్సర్ వ్యాధితో మరణించారు. ఉద్యమమే ఊపిరిగా నిరంతర కృషి జీవనంగా మసలిన మహా మనిషి ఆయన. ఆయన మరణం ఉద్యమానికి తీరని లోటు. 51 సంవత్సరాల చిన్నవయసులోనే మరణించడం మనదురదృష్టం.

సరిగ్గా ఐక్యఉపాధ్యాయ పత్రిక క్యాంపెయిన్‌లో నెల్లూరు జిల్లా చొచ్చుకుపోతున్న సమయం. పత్రికా క్యాంపెయిన్ గురించి కలవరిస్తూ కన్నుమూసారాయన. అంకిత భావంతో పనిచేసే కార్యకర్త మరణం తీరని లోపం. వారిమరణానికి సంతాపాన్ని ప్రకటిస్తూ వారి కుటుంబ సభ్యులకు సానుభూతి తెల్పుకొంటున్నాము.



శ్రీ సి.వి. సుబ్బారెడ్డి నెల్లూరు వి.ఆర్.సి. హైస్కూలులో పని చేస్తూ 5-6-94న మరణించారు. యు.టి.యఫ్. కార్యకర్తగా, నిరాడంబర జీవిగా ఉపాధ్యాయుల ఆదరాభిమానాలు పొందిన వ్యక్తి.



శ్రీ వి. రామచంద్ర నాయుడు యు.టి.యఫ్. గుడిపాల మండల శాఖ మాజీ అధ్యక్షులు 22-3-94 న మరణించిరి. వారి మరణానికి సంతాపం తెల్పుకుంటున్నాము.

PHONE NO VJA : 63763 HYD : 666840

IKYA UPADHYAYA

YEARLY SUBSCRIPTION 30-00
SINGLE COPY 3-00

IKYA UPADHYAYA
Palapurthivari Street,
VIJAYAWADA - 520 002.

# ఐక్య ఉపాధ్యాయ

కొమ్మారెడ్డి కేశవరెడ్డి
(ప్రధాన సంపాదకుడు)
అప్పారి వెంకట స్వామి
దాచూరి రామిరెడ్డి
నాగటి నారాయణ
ఎం.ఎ.కె.దత్తు

సంపుటి - 20 | 1994 జూన్ | సంచిక - 6

## విద్యాసంవత్సరం తిరిగి వచ్చింది

విద్యాసంవత్సరం తిరిగి వచ్చింది. చిన్నారుల కదలికలు, చిరుపాదాల చప్పుడులు, నగుమోము దరహాసాలు తగుమోతభారాలలో తరలివచ్చింది భావిభారతపౌరులు సమూహం.

చదివించేందుకు సీట్లు దొరకక దొరికినాడొనేషన్లు కట్టలేక, కట్టినా పోటీలలో నెగ్గలేక, నెగ్గినా ఫీజులు కట్టలేక కట్టినా భవిష్యత్ అంధకారంగా కనిపిస్తూవుంటే అటుచదివించలేక, ఇటు మానలేక ముందునుయ్యి, వెనుక గొయ్యిగా సతమతమౌతున్న తల్లిదండ్రులు.

శిధిలావస్థలోవున్న విద్యాలయాలు, ఏవసతిలేని తరగతి గదులు, రానిపాఠ్యగ్రంధాలు, అందని నోట్సులు నింపని ఖాళీపోస్టులు, సబ్జక్టు టీచర్లు లేక, చదువులు చెప్పే పరిస్థితులు లేక అతలాకుతలమౌతున్న అధ్యాపకులు.

విక్షేపనులకు ఎంతవస్తుంది, బకాయిలకు ఎంతబాపుకుందాం, బదీలీలకు ఎంతచేదుకుందాం, రీఫిక్షేషన్‌లకు రిమెయినింగ్ ఎంత, ఇంక్రిమెంట్లకు ఇనాము ఎప్పుడు? శలవుల నజరానాలు ఎంత దండుకుందాం, లాంటి అలోచనలు తప్ప, విద్యారంగం గురించి అలోచించని మేనేజిమెంట్లు ప్రభుత్వఆఫీసులు.

హామీల మాటలకోటలు, సమస్యల కుప్పతెప్పలు, హంగు ఆర్భాటాలు, పర్యటన వటాటోపాలుతప్ప, మరేమీపట్టని అధికారవర్గం.

బ్రతుకుతున్నదే విద్యారంగం గురించి అంటూ చేసిన వాగ్దానాలే తిరిగి తిరిగి చేస్తూ, ప్రకటనలుమీద ప్రకటనలుగుప్పిస్తూ, పదవి పరమ పదసోపానంలో పడుతూ లేస్తూ వున్న అమాత్యవర్యులు.

ఇవిచాలక కోళ్ళుకుక్కల లెక్కలంటూ లెట్రిన్‌లు బాత్‌రూముల వివరాలంటూ పందులు పశువుల సమాచారాలంటూ, జనాభా, ఓటర్లలిస్టులంటూ, నిరక్షరాస్యుల, నిరుద్యోగుల సమాచారాలంటూ, అక్షరజాతాలు, అక్షరజాతాలు అంటూ, ఉపాధ్యాయులను పాఠశాలేతరపనులకు ఉపయోగించే విధానాలతో విద్యారంగ యిబ్బందుల పాలవుతుంటే!

దానిని ఉద్ధరిస్తానంటూ కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలు, చదువులకు సమాధిరాళ్లువేస్తున్నారు. విద్య వ్రయివేటు పరంఅంటున్నారు. గ్రామ పంచాయితీలకు విద్యను అప్పగిస్తామంటున్నారు. కోపరేటివ్ కాలేజీలంటున్నారు. డిగ్రీ చదువులతో మాకు సంబంధంలేదు అంటున్నారు. కొనగలవాడికే చదువులంటున్నారు.

నేడు మనకళ్ళముందు కదలాడుతున్న విద్యారంగచిత్రమిది. పరీక్షలు ప్రహసనంగా తయారయ్యాయి. సిలబసు విచిత్రంగా మార్పు చేర్పులకు గురౌతున్నది. సామాజికస్పృహలేదు. శాస్త్రీయవిధానం కానరాదు చివరికి




సెక్యులర్‌భావాలుకూడా పూజ్యం.

చివరికి మాతృభాషకొడిగట్టిపోతున్నది. పరాయి భాషకు పట్టాభిషేకంచేస్తున్నారు. అవినీతి అన్నిరంగాలను కలుషితంచేస్తున్నది. విద్యారంగం దానికి అతీతంగాలేదు.

అయినా భావిభారతపౌరులను తీర్చిదిద్దే ఉపాధ్యాయులు ఈ అంధకారాన్ని చూస్తూవూరుకోవడంకాదు. చిరుదీపాన్ని వెలిగించాలి తమశక్తిని చూపించాలి. అన్యాయం, అక్రమాలు, ఎదిరించిపోరాడాలి. విద్యారంగాన్ని కాపాడుకోవాలి.

ఉద్యమాలు ఉపాధ్యాయులకు మార్గదర్శకంగా నిలవాలి. సమాజాన్ని మార్పుచేసేసోపానాలు కావాలి. ఆశయాలకు అంకితంచేసే కరదీపికలు కావాలి. మనప్రచురణలు, మాటలు, చేతలు అందుకే సాదనాలు కావాలి అందుకు కలిసి పనిచేద్దాం. కదలి అడుగేద్దాం. అందరం కలిస్తే ఎదురేలేదు. ఐక్యశక్తికి తిరుగేలేదు.

1994 ఇంటర్‌లో **State 14th & 20th Rank** లు

సాధించిన స్ఫూర్తితో 1994-95 నుండి వర్తించేవిధంగా

# నాగార్జున రెసిడెన్షియల్ కాలేజి

బైపాస్‌రోడ్, ఒంగోలువారి **Phone: 23985, 24329**

ప్రతిభకు పట్టాభిషేకం

**M.P.C.**
State 20th Rank



934/1000

**D.N. రాధాకృష్ణ M.P.C.**

| Regd. No. | పేరు | Total |
|---|---|---|
| 527894 | D.N.రాధాకృష్ణ | 934 |
| 527918 | Ch. అనిల్‌కుమార్ | 921 |
| 527987 | G. చంద్రశేఖర్ | 915 |
| 527910 | V.V. ప్రవీణ్‌కుమార్ | 915 |
| 527906 | A. జయరాం | 914 |

State Ist Rank సాధించే మా విద్యార్థికి: (Rs. 1,00,000/-

State 2nd to 10th Rank సాధించే మా విద్యార్థులకు: Rs. 50,000/-

మా College First విద్యార్థికి Rs. 25,000/-

**ప్రోత్సాహక బహుమతులుగా ఇవ్వబడును.**

**☆ జూనియర్ ఇంటర్ అడ్మిషన్లు జరుగుచున్నవి.**

**క్లాసులు ప్రారంభం: 15-6-94.**

**B.I.P.C.**
జిల్లా Ist Rank & State 14th Rank



917/1000

**U. రాఘవరావు B.I.P.C.**

| Regd. No. | పేరు | Total |
|---|---|---|
| 528065 | U. రాఘవరావు | 917 |
| 528062 | D. రాఘవులరెడ్డి | 895 |
| 528007 | V. రామకృష్ణారెడ్డి | 891 |
| 528061 | N. కళ్యాణచక్రవర్తి | 856 |
| 527910 | N. [illegible] | 842 |

# దామోదర

## ఇంగ్లీషు మీడియం స్కూల్

**LKG to 7th class (CBSE)**

మంగమూరురోడ్, ఒంగోలు.2

## దామోదర పబ్లిక్‌స్కూల్

4వ తరగతినుండి 10వ తరగతి వరకు తెలుగుమీడియం

శ్రీమన్నారాయణ కంటిఆస్పత్రివద్ద, కర్నూలురోడ్, ఒంగోలు-2

## దామోదర రెసిడెన్షియల్ స్కూల్

5నుండి 10వ తరగతివరకు (తెలుగుమీడియం)

మంగమూరురోడ్, ఒంగోలు-2

**1994మార్చి 10వ క్లాస్ పరీక్షకు హాజరయినవారు: 10 th 1 class:82 II=18 III - 4**

**ఫలితం: 100%**

## వార్తా ప్రపంచం

### పదవ తరగతి పరీక్షా ఫలితాలు

పదవ తరగతి పరీక్షలలో ఈసారి ఉత్తీర్ణతా శాతం పెరిగింది. రాష్ట్రంలో 7,83,760 మంది విద్యార్థులు పరీక్షలకు హాజరుకాగా 48.6 శాతం మంది ఉత్తీర్ణులయ్యారు. గత ఏడాది కన్నా ఉత్తీర్ణత 3 శాతం పెరిగింది. ప్రైవేటు విద్యాసంస్థలపై మోజు పెరుగుతున్న దశలో ప్రభుత్వ పాఠశాలల విద్యార్థులు మంచి ఫలితాలు సాదించడం హర్షించదగ్గ విషయం.

### యం.సెట్‌లో మార్కుల మార్పు

ప్రతిభావంతులైన విద్యార్థులు వారి తల్లిదండ్రులు ఎంతో ఆసక్తిగా ఎదురు చూసే యం.సెట్ పరీక్షా విధానంలో కొన్ని ముఖ్యమైన మార్పులు చేశారు. ఇప్పటి వరకు 150 గా వున్న గరిష్ఠ మార్కుల్ని 200 కి పెంచారు. ఇంజనీరింగు విద్యార్థులు లెక్కలలో సైన్సు విద్యార్థులు సైన్సు సబ్జక్టులలో అదనంగా 50 మార్కులకు సమాధానాలు రాయాల్సి వుంటుంది. అంతేగాక తప్పైన ప్రతిజవాబుకి 1/4 మార్కు తగ్గించాలని నిర్ణయం జరిగింది. జూన్ 22న జరగనున్న యం.సెట్. నుండి ఈ మార్పులు అమలులోకి వస్తాయి.

ప్రైవేటు కాలేజీలలో ఫీజులపెంపు

ప్రైవేటు ఇంజనీరింగు కాలేజీలలో సగం సీట్లు మెరిట్ ప్రసక్తి లేకుండ యాజమాన్యాలు నచ్చినవారికి కేటాయించే పద్ధతిని ప్రభుత్వం స్వస్తి చెప్పింది. వ్వావానికి ఈ విషయమై గత ఏడాదిలోనే సుప్రీంకోర్టు సవివరమైన తీర్పు నిచ్చి వుంది. ఆ తీర్పు మేరకు ప్రైవేటు ఇంజనీరింగు కాలేజీల అడ్మిషన్లను క్రమబద్ధంచేస్తూ మానవ వనరుల మంత్రిత్వ శాఖ మార్గదర్శక సూత్రాలు విడుదల చేసింది. కాలేజీలలోని మొత్తం సీట్లను మెరిట్ ప్రాతిపదికనే కేటాయించాలని, అయితే 50 శాతం సీట్లకు అధికఫీజు వసూలు చేసుకోవచ్చునని, బలహీన వర్గాలకు ప్రత్యేక కేటాయింపులు కూడా మెరిట్‌ను బట్టి జరగాలని, మైనారిటీ సంస్థలలో 50 శాతం సీట్లను మెరిట్ ప్రకారమే మైనారిటీలకు కేటాయించాలని జాతీయవిధానం పేర్కొంటున్నాడు. అయితే ఫీజులు ఏ మోతాదులో నిర్ణయిస్తారో ఇందులో స్పష్టంగా లేదు. కనుక అవి విపరీతంగా పెరిగే సూచనలున్నాయి. అలాగే వైద్య కళాశాలలకు ఈ జాతీయవిధానాన్ని వర్తింపజేయకపోవడం మరో ఆశ్చర్యకరమైన విషయం. ఏమైనా కేపిటేషన్ ఫీజుని సూత్రరీతికే తొలగించడం మేనేజ్‌మెంటు కోటాలో కోతలు పెట్టడం చెప్పుకోదగిన సుగుణాలు.

### సర్వం ప్రైవేటు మయం

ఒకప్పుడు జాతీయం చేయబడిన పలురంగాలు యిప్పుడు ప్రైవేటు పరమవుతున్నాయి. 1994 బ్యాంకింగ్ కంపెనీల (స్వాధీనం, బదలాయింపు) బిల్లు పార్లమెంటులో ఆమోదంపొందింది. బ్యాంకుల పెట్టుబడులలో 49 శాతం వరకు ప్రైవేటు పరం చేసేందుకు బిల్లు వీలు కలిగిస్తుంది. బ్యాంకులను ప్రైవేటు పెట్టుబడిదార్లకు ధారాదత్తం చేసే ఈ బిల్లుని వామపక్షాల దళ్ సభ్యులు తీవ్రంగా తీవ్రంగా వ్యతిరేకించి వాకౌట్‌చేశారు. బి.జె.పి బలపరచింది.

కాగా టెలిఫోన్ సర్వీసులను కూడా ప్రైవేటు పరంచేసేందుకు నూతన టెలికాం విధానం లోకసభలో ప్రవేశపెట్టబడింది. దీనిప్రకారం విదేశకంపెనీలు కూడా టెలిఫోన్ సదుపాయాలు కల్పించి లాభాలు గడించవచ్చు. చాలా కీలకమైన ప్రసార సాధనాల వ్యవస్థను విదేశి కంపెనీలకు అప్పగించే ముందు దేశభద్రతకు కలుగనున్న ముప్పును కూడా అంచనా వేయవలసి వుంటుంది.

### పాఠశాలల పున: ప్రారంభం జూన్ 20 నుండి

ప్రభుత్వ ఉత్తర్వులు ఆర్.సి. నెంబరు 1599/ఇ2/93 తేది 6-6-94 ప్రకారం వేసవి సెలవలనంతరం పాఠశాలలు 20-6-94 నుండి పనిచేయాలని, పాఠశాలల ప్రధానోపాధ్యాయులు మాత్రం జూన్ 10వ తేదీనుండి పాఠశాలల్లో నుండి పాఠ్యగ్రంధాలు విద్యార్థులకు అందించుట తదితర పనులు పర్యవేక్షణ చేయాలని సదరు ఉత్తర్వులో ఆదేశించారు.

పాఠశాలలు తెరచినప్పటినుండి తగా జూన్ 20వ తేదీనుండి నెలాఖరువరకు వెనుకబడిన విద్యార్థులకు ప్రోత్సాహాన్నిచ్చే బ్రిడ్జ్ తరగతులు జరపాలని పై ఉత్తర్వులతో తెలియజేయడమైనది.

కొన్ని పత్రికలలో గందర గోళపరచే వార్తలు వచ్చినకారణంగా విషయాన్ని తెలిసికొని ఈప్రకటన యిస్తున్నామని యు.టి.యఫ్. అధ్యక్ష ప్రధాన కార్యదర్శులు శ్రీ డి. రామిరెడ్డి శ్రీ ఎ. వెంకటస్వామి ఒక ప్రకటన ద్వారా తెలియజేశారు.

### ప్రధాని అమెరికా పర్యటన

భారత ప్రధానమంత్రి శ్రీ నరసింహారావు వారం రోజులపాటు అమెరికాటించారు. అమెరికా ప్రెసిడెంట్ బిల్‌క్లింటన్‌ను కలుసుకుని 2 1/2 గంటకు పైగా చర్చలు జరిపారు.

అణునిరాయుధీకరణ, మానవహక్కుల వంటి అంశాలపై అమెరికా భారత్‌ల మధ్య విభేదాలు వున్నప్పటికీ విస్తృత జాతీయ ప్రయోజనకాలరీత్యా ద్వైపాక్షిక సంబంధాలకు మరింత పటిష్టపరచుకోవాలని ఉభయదేశాలు నిశ్చయించాయి.

అణుపరీక్షలపై సంపూర్ణ నిషేధాన్ని సాధించాలని, అణ్వాయుధాల తయారీలో వాడే పదార్థాల ఉత్పత్తిపై కూడా తనఖీలతో కూడిన నిషేధం విధించే దిశగా సహకరించుకోవాలనీ, యింకా రాజకీయ, వాణిజ్య, శాస్త్రసాంకేతిక సామాజిక రంగాలలో పూర్తి స్థాయిలో సహకారం అందించుకోవాలని తీర్మానించాయి. యన్.పి.టి. కాశ్మీర్ సమస్యలపై విభేదాలు తగ్గలేదని చర్చలు స్పష్టంచేస్తున్నాయి. అంతేగాక భారత్‌లో టెర్రరిస్టు కార్యకలాపాలను పాకిస్తాన్ నిలిపివేసిందని పాకిస్తాన్‌కి అమెరికా కితాబు యిచ్చింది. భద్రతా మండలిలో శాశ్వత సభ్యత్వానికి జపాన్ జర్మనీలను బలపరుస్తూనే భారత్ సంగతి ఎటూచెప్పకుండా అమెరికా దాటవేసింది. మనకు వ్యతిరేకంగా పాకిస్తాన్‌కి ఆయుధాలు సరఫరా చేస్తున్న అమెరికాతో సైనిక సహకారం పెంచుకోవాలని నిర్ణయానికి రావడం ప్రమాదకరం.



# శ్రీనాగభైరవ

## రెసిడెన్షియల్ కాలేజ్ & హైస్కూల్

గుళ్లాపల్లి - ప్రకాశంజిల్లా

(ఒంగోలు - గుంటూరు G.T. రోడ్‌పై 17వ కి.మీ.వద్ద)



## 1994 ఇంటర్ ఫలితాలు

*హాజరైనవారు: 164 I క్లాసులు: 137 II క్లాసులు: 8 III క్లాసులు:3*

*జూనియర్ ఇంటర్‌లో చేరే విద్యార్థులకు*

*B. tech సీట్ గ్యారంటీ కోర్స్ అడ్మిషన్లు జరుగుచున్నాయి.*

- **మెరిట్ టెస్ట్ ద్వారా ఎంపిక**
- **M.P.C. (E.M) లో మాత్రమే**
- **రెండేళ్ల అనంతరం ఎమ్సెట్, IIT లేదా పిలానీలో సీట్ గ్యారంటీ**
- **సీట్ రానట్లయితే ఫీజు వాపస్**

ఇంటర్‌లో MPC & Bi.P.C. ఇంగ్లీషు తెలుగు మీడియాల్లో

మరియుహైస్కూలు 6 నుండి 10వ తరగతివరకు

## అడ్మిషన్లు జరుగుతున్నాయి.



# కథలు - గేయాలు

## డి.ఇ.ఓ. ఆఫీసు

స్వామి

ఈలోకంలో నరకం ఎక్కడ వుంది అంటే ప్రత్యక్షసాక్ష్యం జిల్లావిద్యాశాఖాధివారి కార్యాలయమని చెప్పవచ్చు. అక్కడ యమధర్మరాజు, చిత్రగుప్తుల, కాలకింకరగణాలు. ఒకరేమిటి అందరూ ప్రత్యక్షమవుతారు. పనిమీద వచ్చిన వారి ప్రాణాలుతోడి జీవకళనాశనంచేసి శవాలుగా మార్చిపంపుతారు.

రంగయ్యమాస్టారు అందరిఅభిమానాన్ని చూరగొన్న ఉత్తమ **ఉపాధ్యా**యుడు రిటయిరయి ఏడాది దాటినా ఫెన్షన్‌రాక డి.ఇ.ఓ. **ఆఫీ**సు కెళ్లి గుమాస్తాను కలిస్తే అడిగినలంచానికి గుడ్లుతేలవేసి **బయట**కొచ్చిచెట్టుకింద కూలబడ్డాడు.

ఆప్రక్కనే దిగులుగాకూర్చున్న వెంకయ్యను ఏమిటిఇలా **తచ్చా** అంటే ఏంచెయ్యను రికగ్నిషను రెన్యువలుకు డి.ఇ.ఓ. గారికి **వెయ్యి** ఇవ్వందే సంతకంపెట్టరంట! అంటూ చప్పబడిపోయాడు.

ఆమాట విని ఓ పాంటుబాబు జీతంకాక పోయినా అన్ **ఎయిర్** పోస్టులో పనిచేద్దామని వస్తే చిత్రగుప్తడు (జి.ఎ.డి) కు వేయి **యమధర్మ**రాజుకు (డి.ఇ.ఓ.) పదివేలు ఇవ్వందే ఫైలుపై సంతకం **పడదట** అని బావురుమన్నారు.

ఇదంతా విన్నలోకనాథంపైకి లేచి కండువాదులుపుకుని " నాన్యాలులో ఒక పోన్ట **ఖాళీ**వచ్చింది మా అబ్బాయిట్రయినింగయివున్నాడు. వాడిని వేసుకోవాలంటే ముప్పయివేలు యివ్వందే ఈ దొంగ గాడిదలు సంతకంపెట్టరట " అంటూ కళ్లనీళ్లుపెట్టు కుంటూ కదలిపోయాడు.

ఇంతలో గేటువద్ద గొడవయితే అంతాలేచి నిలబడ్డారు. కాలకింకరుడు (అటెండరు) ఒకడిని మెడపట్టి బయటకు గెంటాడు. ఏమిటి అని అడిగితే ఏముంది వెల్పరు ఫారాలడిగితే డబ్బడిగాడు, లేదంటే మెడవట్టిగెంటాడు అంటూ బట్టల నంటిన దుమ్ముదులుపుకున్నాడు పుల్లయ్య.

ఇంతలో పదిమంది బిలబిలమంటూ ఆఫీసు లోపల నుండి బయటకువస్తూ ఫిక్షేషనుకు యస్.ఆర్.కు రు.200/-లు అంట, బకాయిలకు 10శాతమంట, ఎవడబ్బడబ్బుతెచ్చి కింకరపెద్ద (హెడ్‌గుమస్తా)కు ఇవ్వాలంట! నడండెహె సంఘం దగ్గరకెళ్లి ధర్నాచేద్దాము. అంటూ సంఘ ఆఫీసుకు దారితీశారు, వారిని అక్కడవున్నమిగతావారు అనుసరించారు.

## ఆవేదన

- లలితా భీమయ్య

ఏదో తెలియని బాధ
ఎదలోపల రగులు తుంది
మెదలకుండ కూర్చున్నా
వదలక వేదిస్తూంది
    ఆరుకాలము శ్రమపడిన
    ప్రకృతి కరుణించక
    ప్రతిఫలం కనిపించక
    రైతన్నల దీనాలాపనలు
సామాజిక పోటీమార్కెట్‌లో
చదువు అనే సరుకును
కొనకల్గిన వాళ్లు ఒకవైపు
చదువు అనే సాగర తీరాన్ని
చేరుకోలేని సామాన్య
కుటుంబాలు మరొకవైపు
    ఆకలి దప్పులతో
    అలమ టించువారొకరు
    పదవి ప్రాబల్యానికై
    పరితపించువారు మరొకరు.
    ఈ అంతరాలు అంతరించేది ఎప్పుడో?
    యువతీ, యువకులు చైతన్యవంతులై
    సామాజిక స్థితిగతులను గమనిస్తూ
    సమైక్య సమరం సాగిస్తూ
    నవసమాజం నిర్మిస్తే
    ఆశయాలు నెరవేర్తే.
    ఆశలు చిగురిస్తాయి.

## మహాకవిని (వ్యంగ్యరచన)

-చింతపల్లి నరసింహారావు

ఆధునిక కాలంలో
నేనూ ఒక మహాకవినే
కాదంటే కాళ్లు విరగ్గొడతాను
నాకు వచ్చునీతులు
పదివేలకు పైగా బూతులు
తిట్టినతిట్టు తిట్టకుండా
తిట్టగలను
తిరగబడితే పదిమందినైనా
కొట్టగలను
తలాతోకా లేకుండా
రాయగలను, అచ్చువేయగలను
తాగినపుడు తాత్పర్యం చెప్పగలను
నన్నయ్యకేం తెలుసు
నాయనమ్మ మాడు?
చిన్నయ్యకేం తెలుసు
సీమతలమ్మ బీడు?
నే చెప్పిందే వేదం
ఎందుకు నాతోవాదం?
నా కవిత్వం వినే దమ్ముంటే
కొట్టండి చప్పట్లు
లేకుంటే ఇంటికెళ్లి
ముడుచుకోండి దుప్పట్లు

# సాయి
## రెసిడెన్షియల్ కాలేజి

పంచముఖాంజనేయస్వామిబొమ్మఎదురుగా,

బైపాస్‌రోడ్, ఒంగోలు.

☆ ఇంటర్ మరియు ఎంసెట్‌లో విశేషబోధనానుభవంగల అధ్యాపకులు స్థాపించినసంస్థ
"సాయిరెసిడెన్షియల్ కాలేజి"

☆ ఉత్తమబోధన, పర్యవేక్షణలతో ఇంటర్ మరియు ఎంసెట్‌లలో ఉత్తమఫలితాలను సాధించిన అధ్యాపకులకలయికే...
"సాయిరెసిడెన్షియల్‌కాలేజి"

☆ గత 25సంవత్సరాలుగా ఎందరో ఇంజనీర్లు, డాక్టర్లను తయారుచేసిన అధ్యాపకులసంగమం...
"సాయిరెసిడెన్షియల్‌కాలేజి"

ఇంటర్ సీనియర్, జూనియర్ **M.P.C.,Bi.P.C.,** గ్రూపులకు ఇంగ్లీషు, తెలుగుమీడియంలలో శిక్షణ. మరియు **EAMCET** కోచింగ్.

సీనియర్‌ఇంటర్ అడ్మిషన్స్ ప్రారంభం: **5-5-94 నుండి.**

జూనియర్‌ఇంటర్ అడ్మిషన్స్ ప్రారంభం:10th ఫలితాలు వెలువడినవెంటనే.

ఇట్లు
**P. మాలకొండారెడ్డి**
*కరస్పాండెంట్.*

---

స్థాపితం: 1990 | ఫోన్: 2647.



రెసిడెన్షియల్ జూనియర్ కాలేజి.

(కో.ఎడ్యుకేషన్; తెలుగు అండ్ ఇంగ్లీషుమీడియం)

M.P.C; Bi.P.C; H.E.C; M.E.C: వినుకొండ, గుంటూరుజిల్లా 522647.

పబ్లిక్ ట్రినిటి స్కూల్
(ఇంగ్లీషు మీడియం)
LKG to 6th class.

ట్రినిటి రెసిడెన్షియల్ స్కూట్
తెలుగు మీడియం
3వ తరగతి నుండి 10వ. తరగతి వరకు.

## కో ఎడ్యుకేషన్.

బాల, బాలికలకు విడి విడిగా హాస్టల్ వసతి గలదు.

**6-6-94 నుండి తరగతులు ప్రారంభం.**

అడ్మిషన్లు జరుగుచున్నవి.

డైరెక్టర్.
గుత్తాబాలశౌరి
ట్రినిటి సాంఘిక విద్యాసంస్థ.
మార్కాపురంరోడ్, వినుకొండ. గుంటూరు. 522647.

## మీకు తెలుసా?

సేకరణ: జి. వేంకటరాములు

1) భారత రైల్వేబోర్డు ఛైర్మన్ ఎవరు?
2) రాష్ట్రంలో అతిపెద్ద షిపింగ్ హార్బర్ ఏది?
3) ప్రపంచంలో టి.వి. ప్రసారాలు మొదట ఎక్కడ ప్రారంభమయ్యాయి?
4) బొంబాయి హైకోర్టుతొలి మహిళాప్రధానన్యాయమూర్తిఎవరు?
5) చండీఘర్ నగరానికి ఎవరు రూపకల్పన చేశారు?
6) మొట్టమొదట ప్రపంచ పటాన్ని గీసినది ఎవరు?
7) ప్రపంచంలోని 270 భాషలు నేర్చుకున్నవారు ఎవరు?
8) ద్వీపాలన్నింటిలోకి ఏద్వీపం పెద్దది?
9) నాటోకూటమిలోని మొత్తం సభ్యదేశాలు ఎన్ని?
10) 1994వ సంవత్సరపు బంగారునంది అవార్డుపొందిన ఉత్తమ తెలుగు చిత్రం ఏది?
11) దేశంలో విద్యారంగం అభివృద్ధికి ఇటీవల సూచించిన సుంకం?
12) ఆంధ్రప్రదేశ్‌లో నవబ్రహ్మదేవాలయము ఎక్కడవుంది?
13) ఢిల్లీలో ఎర్రకోటను (Red fort ) నిర్మించింది ఎవరు?
14) ప్రపంచ వర్తక సంస్థగా గాట్ ఎప్పుడు ఆవిర్భవించబోతోంది?
15) మైనారిటీల జాతీయ కమీషన్ ఛైర్మెన్ ఎవరు?
16) అత్యధిక పరిమాణంలో ప్రొటీన్‌లు కలిగినది?
17) అండమాన్ ద్వీపంలో ఎత్తైన శిఖరం?
18) పెన్నానది ఎక్కడ పుడుతుంది?
19) Between the lines (బిట్వీయిన్ దిలైన్స్) పుస్తక రచయిత?
20) మహాత్మాగాంధీ హత్య ఎచ్చట జరిగింది?
21) మొత్తం భారతదేశజనాభాలో ముస్లింలు ఎంతశాతము?
22) తెలుగు భాష ఎంత ప్రాచీనమైనది?
23) డా॥ సుబ్బారావు కనుగొన్న యాంటిబయోటిక్ మందు?
24) చాలా తెలివిగల జంతువుఏది?
25) పొటాషియం సైనేడ్ రుచి పరీక్షిన్నూప్రాణాలు పోగొట్టుకున్నశాస్త్రవేత్త?
26) అత్యధిక దూరం ప్రయాణం చేయు పక్షిఏది?
27) శరీరంలో చీము పట్టడానికి కారణం ఏమిటి?
28) మన రాష్ట్రంలో అక్షరాస్యతలో ప్రథమస్థానంలోవున్న జిల్లాఏది?
29) ఆంధ్రప్రదేశ్‌లోని జలవిద్యుత్ కేంద్రాల సంఖ్య?
30) ప్రపంచంలో అంత్యంత వృద్ధురాలైన మహిళ?

**జవాబులు**

1. ఎం. కృష్ణారావు 2. కాకినాడ 3. న్యూయార్క్ (అమెరికా) 4. జస్టిస్ సుజాతా మనోహర్ 5. లీకార్బ్యూజియర్ 6. అవాగ్జిమెయిన్ 7. డా॥ హెరాల్డ్ 8. గ్రీన్ లాండ్ 9. 16 10. మిస్టర్ పెళ్లాం 11. విద్యాసెస్సు 12. ఆలంపూర్ 13. షాజహాన్ చక్రవర్తి 14. 1995 15. జిస్టిస్ మహ్మద్ సర్దార్ ఆలీఖాన్. 16. సోయాచిక్కుడు 17. శాడిల్ శిఖరం 18. నందిదుర్గకొండలు (కర్ణాటక) 19. కులదీప్‌నాయర్ 20. న్యూఢిల్లీలోని జ.డి. బిర్లాగృహం 21. 11-35శాతం. 22. క్రీ.శ. 7వ శతాబ్దం 23. ఆరోమైసిన్ 24. చింపాంజీ 25. కార్లవిలియమ్ స్కీవ్-స్వీడన్ 26. ఆర్కిటిక్‌టెర్న్ 17,500కి.మీ. 27. స్టాఫైలోకాకస్‌జీవులు 28. హైదరాబాద్ 71 52 శాతం. 29. 09 30. జీన్ కామెంట్.

సేకరణ - బి. మోక్షానందం.

### I. చెప్పండి చూద్దాం!

1. చదరంగపు బల్లపై మొత్తం ఎన్ని చదరాలుంటాయో చెప్పగలరా? అరవైనాలుగు అనేయకండీ... మరోసారి "ఆలోచించండి".
2. 3రూపాయిలకు 5 పావురాలు, 5 రూపాయిలకు 7 గోరువంకలు, 9 రూపాయిలకు 3 రామచిలుకలు చొప్పున ఏరకం పక్షులు ఎన్నెన్ని కొంటే " వందరూపాయిలకు వంద పక్షులు" వస్తాయి?
3. అద్దంలో ప్రతిఫలించినా, తలక్రిందులు చేసినా విలువ మారని అంకె లెన్ని? అవి ఏవి?
4. మూడు చేత భాగిస్తే 1 శేషం, 4 చేత భాగిస్తే 2 శేషం, 5తో భాగిస్తే 3 శేషం, 6చేత భాగిస్తే 4 శేషం వచ్చే చిన్న సంఖ్య ఏది?

### II. భాషతో భేటీ. . .

1. ఇనుము చివర మారి ప్రథమా విభక్తితో 'సూర్యుడు'.
2. 'వటవృక్షం' మొదలుతో పనికిరానివాడు.
3. 'విన్నపం' రూపం మారితే కద్రువ సవతి!
4. గొడుగు మొగుడు - మహారాష్ట్ర నాయకుడు.
5. ఓ బాలుడు తన తల్లితండ్రులను చంపేస్తే ఏమవుతాడు?
6. ఏభర్తకూడా తన భార్యలో చూడలేనిది?
7. లెక్కలు వచ్చిన చీమ పేరేమిటి?
8. పేరులోనే గౌరవార్థకం ఉన్న జంతువు?
9. పేరులోనే 'ధర' గల పండు?
10. మూడక్షరాల వంటి సాధనం - మధ్య అక్షరం తొలగిస్తే - అంగమైకల్యం

### III తేమైడఎడికు. . .?

(ఈ ప్రశ్నలకు జవాబులు ఎటుచదివినా ఒకే అర్థం వస్తాయి. అవేమిటో ఆలోచించండి - చిన్న - క్లూ - అన్నీ ఐదుఅక్షరాలపదాలే)

1. ఏమి చేయక ఏటినీరు వృథాయగును?
2. కలహంస విహరించు కాసార మెయ్యది?
3. లజ్జ ఎవ్వరికమూల్యపుటలంకారంబు?
4. దేవాంగులకు జీవనం బేది?
5. రాజులకెట్టి రత్నంబులు బ్రియమగును?

జవాబులు వచ్చేసంచికలో. .

### IV. పదాల పదనిసలు

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| కొ వె ల | ప్ర పం చం | S H E | S I N | C A R |
| వె న్నె ల | పం చా ద్రి | H E N | I C E | A T E |
| ల ల న | చం ది క | E N D | N E T | R E D |

ప్రశ్నలకు జవాబులు ఉపాధ్యాయుడు తయారుజేసి, విద్యార్థి చేత ఒప్పజెప్పించి, పరీక్షలో వ్రాయించే పద్ధతికి ఈ విద్యాసంస్థలో స్థానములేదు. విద్యార్థి క్లాసులో పాఠమును బహుజాగ్రత్తగా విని, టెక్ట్స్‌బుక్ క్షుణ్ణముగా చదివి, స్వయముగా జవాబులు వ్రాయుట మా విధానము.

**విద్యార్థి స్వయముగా జవాబులు వ్రాయుటలో గల సుగుణములు**

1. విజ్ఞానము విద్యార్థికి శాశ్వతమైన సొత్తుగా లభించును.
2. ఆలోచనాశక్తి పెరుగును.
3. క్రమశిక్షణతో కష్టపడి పనిచేయు స్వభావము బలపడును
4. ఎటువంటి క్లిష్ట సమస్యనైనాపరిష్కరించుకొని ముందుకు పోగల చొరవ, ఆత్మవిశ్వాసము బలపడును.
5. కార్యసాధనకు అవసరమైన పట్టుదల పెరుగును
6. ఇతరుల మీద ఆధారపడకుండా స్వశక్తిమీద ఆధారపడి కార్యమును సాధించు వ్యక్తిగా పెరుగును.
7. పఠన శక్తి పెంపొంది, తనకవసరమైన ఏ రంగములోనైనా తనటెక్ట్స్‌బుక్‌తోనే ఆగక, పలువిశిష్టగ్రంథములను చదివి వాటి సారాంశమును గ్రహించి, తన విజ్ఞానమును అపారముగా పెంచుకొన గలడు.
8. ఇటువంటి అధ్యయన సాధనలుగల విద్యార్థిE AMCETతో సహా ఏపోటీ పరీక్షలోనైనా గట్టి అభ్యర్థిగా నిలువగలడు.
9. ఈ విధానములో శిక్షణ ఈనాడు విద్యారంగమును పీడించుచున్న కాపీ కొట్టుటను నిర్మూలించుటలో ప్రధాన పాత్ర వహించగలదు.

**ఉపాధ్యాయుడు తయారు చేసిన జవాబులు ఒప్పజెప్పి వ్రాయుటలో గల బలహీనతలు.**

1. అతి ప్రధానమైన క్లాసురూము బోధనను బలహీన పరచును
2. విద్యార్థి ఆలోచనాశక్తిని పెరగనివ్వదు.
3. మేధాశక్తికి పదును పెట్టదు.
4. చొరవను, సొంత ఆలోచనను, ఆత్మవిశ్వాసమును దెబ్బతీయును.
5. పరిశీలన, తర్కదృష్టి మరుగున పడిపోవును.
6. విజ్ఞానార్జనకు ఎంతోప్రధానమైన పఠనాసక్తి సన్నగిల్లిపోవును.
7. క్రమశిక్షణా ప్రాధాన్యతను గుర్తింప నివ్వదు.
8. పరీక్షలలో కాపీ కొట్టుటకు ప్రేరణనిచ్చును.
9. భావి పౌరులైన మన విద్యార్థులు ఇటువంటి హానికరమైన విధానములో విద్యనభ్యసించుట దేశాభ్యున్నతికి తీరని నష్టము.
10. ఇటువంటి హానికరమైన విధానము కొనసాగుటకు కారణమేమిటో, దీనిని నివారించుటకు మార్గమేమిటో ఆలోచించుట మేధావులు మొదలుకొని, సాధారణ ప్రజలతోసహా అందరి యొక్కకర్తవ్యము. ఒక విద్యాసంస్థగా ఈ హానికరమైన పద్ధతికి మాహైస్కూల్ విభాగములో గత ఐదారు సంవత్సరములు గాను, కాలేజి విభాగములో గత సంవత్సరకాలముగాను స్థానము లేకుండా చేసినాము.

## EAMCET శిక్షణ

ఇంటర్మీడియట్ పరీక్షకు పాఠములను బోధించు క్రమములోనే సంవత్సరప్రారంభమునుండి **EAMCET** కు శిక్షణయిచ్చుట మా విధానము. జూనియర్ సీనియర్ క్లాసులకు ఇట్టి శిక్షణ కలదు. ఈ పద్ధతిలో విద్యార్థి, 'లాంగ్‌టర్మ్' శిక్షణపొందిన విద్యార్థి ఎంత గట్టి స్థాయికి చేరునో అంత గట్టి స్థాయికి చేరగల అవకావము గలదు. **EMCET** తో సహా ఏ పోటీ పరీక్షలోనైనా గట్టిగా నిలువగల స్థితిలో నుండును. ఈ సందర్భములో ఇంటర మీడియట్ పరీక్ష, ఎంసెట్ పరీక్ష ఈ రెండు పరీక్షలకు కూడా మూలము ఇంటర్మీడియట్ టెక్ట్స్‌బుక్స్ అను విషయము గుర్తించవలయును.

ఆర్థికము:- మా హాస్టలు అయిన ఖర్చును మాత్రమే విద్యార్థి భరించునట్టి ఆదర్శవంతమైన భాగహారపద్ధతిన నడుచుచున్నది. గత సంవత్సరము ఒక ఇంటర్మీడియట్ విద్యార్థికి భోజనము, వసతి, పుస్తకములతో సహా స్టేషనరీ, బోధన మొదలగు అన్ని అవసరములు సగటున రు. 11,500లు తో తీరినవి. ఈ మొత్తము ఇంటర్మీడియట్ పరీక్ష జరుగు వరకు మాత్రమే. ఈ సంవత్సరము ఇప్పుడున్న ధరల ప్రకారము **EAMCET** శిక్షణతో సహా, **EAMCET** పరీక్ష జరుగు వరకు రు.13,500లు కావచ్చునని మేము భావించుచున్నాము.

**జూనియర్ ఇంటర్‌లో విద్యార్థిస్థాయిని పరీక్షించి చేర్చుకొనెదము.**

గ్రూపులు: M.P.C, Bi.P.C. మీడియా: తెలుగు, ఇంగ్లీషు. యూనిఫామ్: white full hand open shirt and white trousers four pairs.

### 1994 మార్చి పరీక్షాఫలితములు

| | 10వ తరగతి | సీనియర్ ఇంటర్ | 7వ తరగతి |
|---|---|---|---|
| ఉత్తీర్ణత | 97.3% | 90% | 99.4% |
| శిక్షణ పొందినవారు | 264 | 114 | 164 |
| పరీక్ష వ్రాసినవారు | 264 | 114 | 164 |
| ప్రథమశ్రేణి | 208 | 77 | 129 |
| ద్వితీయశ్రేణి | 39 | 23 | 28 |
| తృతీయశ్రేణి | 6 | 1 | 6 |

1994 మార్చి 7వ తరగతి పరీక్షకు హాజరైన 164 మంది విద్యార్థుల సగటుమార్కు 419, 1994 మార్చి సీనియర్ ఇంటర్ పరీక్షలకు హాజరైన 114 మంది విద్యార్థుల సగటుమార్కు 644

డైరెక్టర్

వి.వి. సుబ్బయ్య

# ప్రశ్నోత్తరాలు

నిర్వహణ :డి. రామిరెడ్డి

ప్రశ్న: శ్రీకృష్ణయ్య - ముప్పవరం - ప్రకాశంజిల్లా
1993 స్కేళ్లలో 6జి (1) ప్రకాశం పే ఫిక్షేష న్ చేస్తే ఇంక్రిమెంటు తేదిమారుతుందా? ఏసందర్భాలలో మారుతుంది.

జవాబు:- యఫ్. ఆర్ 22ఎ (1) ప్రకారం పై స్టేజిలో పే ఫిక్సేషను జరిగినపుడు మరలా 12 నెలలకే యింక్రిమెంటు వస్తుంది. కాని 1974నుండి పి.ఆర్.సి. పే ఫిక్సేషన్ జరిగిన ప్రలదఫా 12 నెలలకు కాక పాతయింక్రిమెంటు తేది కొనసాగుటకు ప్రభుత్వం పాలసీగా ఉత్తర్యులిస్తుంది. అందుచే పి. ఆర్.సి. ఫిక్సేషను మామూలుగ జరిగినా, 6జి (1) ప్రకారం జరిగినా యింక్రిమెంటు తేది మారదు. అంతేగాక 31 (2) ప్రకారం రిఫిక్స్ చేసికొనుటకు కూడ అవకాశముంది. ఆటోమాటిక్ అడ్వాన్సు మెంటుస్కీము ప్రకారం 10/15/22 లేక 8/16/24 సం॥ స్కేలులో పే ఫిక్సేషను జరిగితే 12 నెలలకే యింక్రిమెంటు వస్తుంది.

ప్రశ్న:- శ్రీ టి. నారాయణరావు - టంగుటూరు ప్రకాశంజిల్లా డి.ఎ. దగ్గరి రూపాయకు సవరించాలని మీరు అనేకసార్లు వ్రాశారు. డి.ఎ.జి. ఒలలో ఎక్కడా ఆవిధంగాలేదు. మీరు దేని ఆధారంగా వ్రాస్తున్నారు?

జవాబు: మనరాష్ట్రప్రభుత్వం డి.ఎ. విషయంలో కేంద్రప్రభుత్వ విధానాన్ని యథాతథంగా అమలు పరుస్తున్నది. 1987 అక్టోబరుకు పూర్వం కేంద్రం డి.ఎ. పెంచిన జి.ఒలలో దగ్గరి 10పైసలకు సవరించాలని వ్రాసేవారు. కాని 1987 అక్టోబరునుండి కేంద్ర డి.ఎ.జి. ఒలలో 50పైసలకు లోపు వదలవేయాలని 50పైసలకు మించితే రూపాయకు సవరించాలని వ్రాస్తున్నారు. మన ప్రభుత్వ జి.ఒ 147తే 12.6.86 వరకు దగ్గరి పదిపైసలకు సవరించాలని పేర్కొన్నారు. జి.ఒ 358 తే 30.12.87 నుండి వెలువడిన డి.ఎ.జి.ఒ లన్నింటిలో ఈ అంశముతొలగించారు. అయితే కేంద్రం వ్రాసినట్లు స్పష్టంగా వ్రాయలేదు. కేంద్రప్రభుత్వ పద్ధతే పాటిస్తున్నామని ఆర్థికశాఖవారు వివరిస్తున్నారు. రాష్ట్రప్రభుత్వ జి.ఒ లలో కూడ స్పష్టంగా వ్రాయడం అవసరం.

ప్రశ్న: టి. ప్రకాశరావు - గుంటూరు జిల్లా
1.1.89 నాటికి 15సం॥ సర్వీసుపూర్తియింది. పి.ఎ.టి పరీక్ష ఏ తేదీలోపు ప్యాసుకావాలి?

జవాబు: జి.ఒ.యం.యస్. నెం 166 ఆర్థిక తే 1-5-85 ప్రకారము 15 సం॥ నిండిన తేది నుండి 5సం॥లోపు ప్యాసుకావచ్చు. అందుచేమీరు 1.1.94లోపు ఎ.ఎ.ట ప్యాసయినా మాకు 1-1-89 నుండి ఆర్థికలాభం చెల్లిస్తారు.

ప్రశ్న:శ్రీ వి. శ్రియఃపతిరావు - కామేపల్లి ప్రకాశంజిల్లా
దక్షిణ భారత హిందీ ప్రచారసభ (మద్రాసు) వారి "ప్రవీణ" మరియు "ప్రచారక్" డిప్లొమో విద్యార్హతలలో గ్రేడ్ 11 హిందీ పండితునిగ 1974లో ఉద్యోగంలో చేరాను. "ప్రవీణ" అర్హతకు అదనపు యింక్రిమెంటు యిచ్చారు. కాని దీనిని కనీసఅర్హత క్రింద పరిగణించాలి అని ఆడిట్‌వారు రికవరీ పెట్టారు? వారి అభ్యంతరము సరియైన దేనా?

జవాబు: జి.ఒ.యం.యస్. నెం:1046 విద్య తే.17.12.79 ప్రకారం గ్రేడ్ 11 హిందీపండితులకు కనీసవిద్యార్హత ఓరియంటల్ టైటిలు మరియు పండిట్సు ట్రైనింగు వగైరా. ద.బా. హిం.ప్రచారసభ విశారద (ఓరియంటల్) కనీసవిద్యార్హత అవుతుంది. కాన ప్రవీణకు అదనపు యింక్రిమెంటు యిచ్చుట సరియైనదే.

ప్రశ్న:- శ్రీకాలేషా - అనంతపురంజిల్లా
1974లో ట్రైనింగు లేకుండా ఓరియంటల్ టైటిలతో గ్రేడ్ 11 పండిట్‌గా నియమింపబడినాను. 1982లో ట్రైనింగు పూర్తిచేశాను. నాకు గ్రేడ్ 11 పండిట్‌గా జాయినింగు తేది నుండి సర్వీసు రెగులరైజు చేశారు. అప్పటి నుండి సర్వీసు లెక్కించి 10,15 సం॥స్కేలు యిచ్చారు. కాని ఆడిట్‌వారు ట్రైనింగు అయినప్పటి నుండే సర్వీసు లెక్కించాలని అభ్యంతరం వ్రాశారు? సరియైనదేనా?

జవాబు: ఆడిట్ అభ్యంతరం సరియైనదికాదు. జి.ఒ.ఆర్.టి నెం:1227 విద్య తే 30.6.82 ప్రకారము 1.1.80 నాటికి 5సం॥ సర్వీసు కలగిన గ్రేడ్ 11 భాషా పండితులందరికి ట్రైనంగు మినహాయించబడింది. జి.ఒ. యం.యస్ నెం:782 విద్య తె. 9.9.82 ప్రకారం జి.ఒ. తేదినాటికి సర్వీసులోయున్న గ్రేడ్11 భాషా పండితులందరికి ట్రైనింగులే కుండా సర్వీసు రెగులరైజుచేయవచ్చును. కావున 9.9.82 తర్వాత నియమింపబడినవారికి మాత్రమే ట్రైనింగు నిర్బంధము.

ప్రశ్న:- యం.సీతారామానుజాచారి - ఖమ్మంజిల్లా
8-12-65 గ్రేడ్ 11 గానియమింపబడినాను. 28-1-70న గ్రేడ్ 1 ప్రమోషను పొందాను. 28-1-85 15సం॥స్కేలు పొందాను. 85 డిశంబరులో యం.ఎ. తో సమానమైన సాహిత్యరత్న ప్యాసయినాను. మెమో 45428/1004/ఎ./పి సి-1/ 93-3 తే 13-4-94 ప్రకారం నాకు అదనపు యింక్రిమెంటువస్తుందా?

జవాబు:- పాఠశాలవిద్యాసంచాలకులు మెమో ఆర్.సి.నెం. 1043/జి4/ 93 తే 19.8.93, 1.9.93 యిచ్చిన వివరణలో సెకండరీ గ్రేడుటీచర్లు 15,22సం॥ స్కేలు తీసికొంటే బి.ఎ. బి.ఇడికి అదనపు యింక్రిమెంట్లు పొందుటకు అర్హులు కారుఅన్నారు. ఏస్కేలుఅయితే తీసుకొంటున్నారో అపొస్టుకు కావలసిన

---

'మే' నెల పత్రికలోని " చెప్పండి చూద్దాం" జవాబులు

1) ప్రియుడు గంటకు 4 కి.మీ. చొప్పున, ప్రియురాలు గంటకు 3 కి.మీ. చొప్పున ప్రయాణం చేస్తే - ప్రియుడు 36 కి.మీ, ప్రేయసి 27 కి.మీ ప్రయాణించిన తర్వాత ఒకరి నొకరు కలుసుకుంటారు. (9గంటల తర్వాత)

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| గంటలు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
| ప్రియుడు | 4 | 8 | 12 | 16 | 20 | 24 | 28 | 32 | 36 |
| ప్రేయసి | 3 | 6 | 9 | 12 | 15 | 18 | 21 | 24 | 27 |

2) సంఖ్యలోని సగానికి 45 కలిపితే రెట్టింపయ్యే సంఖ్య -30

3) (తొమ్మిది చుక్కలను నాలుగు సరళరేఖలతో కలుపుట)

4) (పది నాణెములను వరుసకు నాలుగు చొప్పున ఐదు వరుసలలో పేర్చు విధము)

కనీసవిద్యార్హతలకు అదనపుయింక్రిమెంట్లు రావు. అదే సూత్రం గ్రేడ్ 1 భాషాపండితుల కు వర్తింపజేస్తేవారు పొందు 15,22 సం॥ స్కేళ్ళు ప్రధానోపాధ్యాయులు పి.ఇ.ఒ పోస్టుల స్కేళ్ల వాటికి కనీసఅర్హత బి.ఎ.బి.ఇడి.కావున పోస్టుగ్రాడ్యుయేటు అర్హతకు యింక్రిమెంటు రావాలి. ప్రధానోపాధ్యాయుల పోస్టుకు అదనపు ఇంక్రిమెంట్లు లేవను సాకుతో ఆడిట్ అభ్యంతరం పెడుతున్నారు. వికరణ పొందాలి.

## సాధారణ ప్రశ్నలు

1) జిల్లాపరిషత్, ప్రభుత్వ ఉన్నతపాఠశాలల ప్రధానోపాధ్యాయుల పోస్టు ఏప్రాతిపదిక పై భర్తీ చేస్తారు?

జవాబుః జి.ఒ 40 ప్రకారం వీటిని జోనల్ పోస్టులుగ పరిగణించి ఉమ్మడి సీనియారిటీ ప్రకారం భర్తీచేస్తారు. కాని అపాయింటుఫార్ములా ప్రకారం రాష్ట్రపతి ఆమోదం రావడం ఆలస్యమవుతున్నందున 1994 జూన్. జులై నెలల్లో పాతపద్ధతి ప్రకారం (278జి.ఓ.) జిల్లావరిషత్/ డి.ఇ.ఒలు ఎవరియాజమాన్యంలో వారే భర్తీచేసికొనుటకు త్వరలో ఉత్తర్వులిచ్చుటకు విద్యాశాఖ కార్యదర్శిగారు మేనెలలో అంగీకరించారు. ఆమేరకు త్వరలో ఉత్తర్వులు రాగలవని ఆశిస్తున్నాము.

2.ప్రశ్న : ఒ.యం.సి నిబంధనలంటేఏమిటి? వివరించండి?

జవాబుః అన్నిడిపార్టు మెంట్లలో సర్వీసురూల్సు ప్రస్తుత పరిస్థితుల కనుగుణంగా నవరించి రూపొదించుటకు 1983 ఏకసభ్యసంఘాన్ని నియమించారు. ఆకమిటి 1986లో ప్రభుత్వానికి రిపోర్టుయిచ్చింది. విద్యాశాఖలో ఉపవిద్యాశాఖాధికారి, ఆపైగల పోస్టుల భర్తీకి గతంలో ఉన్న "ఎడ్యుకేషనల్‌సర్వీసు" జి.ఒ 239 సవరించి క్రొత్త ప్రతిపాదనలు చేశారు. దానిని 8సం॥ విద్యాశాఖ ఆమోదించకుండా త్రొక్కిపట్టి పాత నిబంధనలప్రకారమే ప్రమోషన్లు యిచ్చారు. దానివల్ల ఉపాధ్యాయులకు రావలసిన అనేక పోస్టులునాన్‌టీచింగువారికి పోయాయి. దానిపైఅన్నీ ఉపాధ్యాయ సంఘాలు "ప్రేసీడియంగా' ఏర్పడి మె 28.29,30 తేదీలలో ప్రభుత్వంతో చర్చించి కొన్ని సిఫారసులు చేశాయి. ప్రస్తుతం అనిబంధనలు ఆమోదం కానందున, పాతనిబంధల ప్రకారమే అనేక గజిటెడ్ పోస్టులు భర్తీ చేసే ప్రయత్నం జరుగుతుంది.

3. ప్రశ్నః ఎ.వి.యస్ రెడ్డిగారి కమిటీ అనేక అంశాలు చర్చించారు. నివేదిక వెలువడిందా? జి.ఒ.లు ఎప్పుడు వస్తాయి?

జవాబుః ఈ ప్రశ్నోత్తరాలు వ్రాసే సమయానికి వెలువడలేదు ఆర్థికశాఖ సిబ్బందిలో యటీవల భారీ ఎత్తున బదిలీలుజరిగాయి. అందుచే అనేకప్రతిపాదనలు వారివద్ద పెండింగులో ఉన్నాయి.

4.ప్రశ్నః ఎయిడెడ్ ఉపాధ్యాయులకు మొదట క్వార్టరు గ్రాంటు మే జీతాలకు చాలలేదు? పి.ఆర్.సి. అరియర్సురాలేదు? సంఘకృషి ఏమిటి?

జవాబుః ఈ విషయమై మార్చి నుంచి ప్రత్యేక వత్తిడి తెస్తున్నాము. ఫలితంగా 7.7 డి. ఎ పొందే ఉత్తర్వులు వచ్చాయి. మిగిలిన 3 క్వార్టర్ల గ్రాంటు జూన్ 15లోగా విడుదల చేస్తామన్నారు. పి.ఆర్.సి అరియర్సు వివరాలు కొందరు డి. ఇ. ఒ లు పంపలేదు. మే ఆఖరుకు వచ్చిన ప్రతిపాదనలు ఆర్థిక శాఖకు పంపారు. త్వరలో అరియర్సు విడుదల అవుతాయి.

5. ప్రశ్నః ఆక్టు -14 పరిస్థితి ఏమిటి?

జవాబుః ఆక్టు -14 పై ట్రిబ్యునల్‌లో తీర్పు వచ్చింది. ఇద్దరు జడ్జీలు యాక్టును సమర్థించారు. ఒకరు వ్యతిరేకించారు. అందుచే ట్రిబ్యునల్‌లో ఉపాధ్యాయులు ఓడిపోయినట్లే, అందుచే రికవరీలు చెల్లించాలి లేదా సుప్రీం కోర్టుకు అప్పీలు చేసికోవాలి.

6. ప్రశ్నః సెకండరీగ్రేడు సెలక్షనుగ్రేడు యిచ్చిన వారికే 96-200 స్కేలులో మేగ్జిమం చేరినా, చేరకపోయినా 200-240 స్కేలులో 210 యిచ్చే ట్రిబ్యునల్‌తీర్పు. గ్రేడ్ 11 భాషా పండితులను 10.8.83న యఫ్.ఆర్.22 (బి) వర్తించే తీర్పు పైప్రభుత్వఉత్తర్వులు వెలువడినవా?

జవాబుః యింతవరకు వెలువడలేదు. పైతీర్పులు అందరికి వర్తింపచేయమని అనేకతఫాలు విద్యాశాఖ అధికార్లకు ప్రాతినిధ్యంచేశాం. ఈనెలలో గట్టి వత్తిడి తెచ్చే ప్రయత్నం చేస్తున్నాం.

7. ప్రశ్నః కరెస్పాండెన్సు కోర్సులవారు పరీక్షలను వెళ్లినకాలం ఆన్‌డ్యూటీగా పరిగణించే ప్రయత్నం చేస్తున్నారా?

జవాబులుః గతంలో దీనిపై 2సార్లు ప్రభుత్వఉత్తర్వులు వచ్చాయి. డిప్యుటేషన్‌పై వెళ్లినవారికి ఆన్ డ్యూటీ యివ్వాలని, యితరులకు యివ్వరాదని యిచ్చారు. మరల ప్రయత్నం చేస్తున్నాం.

8. ప్రశ్నః 89 అక్టోబరు తర్వాత ఇంటర్ మీడియట్ అర్హతతో కర్నాటకలో యన్.జి.బి. లు చదివిన వారికి మన ప్రభుత్వంగుర్తింపు యిచ్చిందా? రాబోయే డి.యస్.సికి వారిని అనుమతిస్తారా?

జవాబుఃలేదు. యింతవరకు వారి సర్టిఫికెటుకు మనరాష్ట్రప్రభుత్వంగుర్తింపు ఈయలేదు. అందుచే ట్రిబ్యునల్‌ద్వారా ఉత్తర్వులు పొంది డి.యస్.సికి హాజరగుట మంచిది.

9ప్రశ్నః ఉన్నత పాఠశాలల్లో ప్రధానోపాధ్యాయులో పోస్టులు బి.ఇ.డి. ఉపాధ్యాయుని 14 రోజులకంటే మించి ఫుల్ అడిషనల్ చార్జి ఇన్‌చార్జిగ నియమిస్తే అదనపు పే ఎంతవస్తుంది?

జవాబు : ఇటువంటి సందర్భాలలో యఫ్.ఆర్ 49 ప్రకారం అదనపు వేతనం చెల్లిస్తారు. సూచనలు (సి) లో అన్ని వివరాలున్నాయి. నియామక స్వభావాన్ని బట్టి అదనపు పే ఉంటుంది.

ఎ) నియామకం అదనపు పోస్టుకు సంబంధించిన పూర్తి బాధ్యతలు నిర్వర్తిస్తే అతనికి 6 నెలలకు మించకుండా అదనపు వేతన మిస్తారు. అందులో మొదటి 3 నెలలు నిబంధనలమేరకు యిస్తారు. మిగిలిన 3 నెలలకు దానిలో సగం యిస్తారు (నోటు-2) మొదటి 3 నెలలు వారి సబ్స్టాంటివ్ జీతంలో సగం యిస్తారు. అయితే యిది అదనపు పోస్టులు కనీస వేతనంలో 1/2 లోకి మించరాదు. ఉదా ॥ బి.ఇ.డి. స్కేలు లో 4010 వేతనం తీసికుంటూ ప్రధానోపాధ్యాయుల పోస్టులో యఫ్. ఎ.సి గా నియమింపబడితే తన జీతంలో 1/5 వంతు అనగా 802 పొందవచ్చు. ప్రధానోపాధ్యాయ పోస్టులో కనీస జీతం 3020 దానిలో సగం రు. 1510 అందుచే వీరికి మొదటి 3 నెలలు రు. 802 తర్వాత 3 నెలలు రు. 401 చెల్లిస్తారు. దీనిపై డి.ఎ. ఇంటిఅద్దె అలవెన్సు మొదలగునవి అన్ని చెల్లిస్తారు.

(జి.ఓ.యం.యస్.నెం. 401 ఆర్థిక తే 17.11.77)

బి) నియామకం తాత్కాలిక విధులకే పరిమితమైతే పై చెప్పిన వానిలో 50% మాత్రమే చెల్లిస్తారు. అనగా సబ్స్టాంటివ్ వేతనంలో 1/10, 3 నెలలు దానిలో 1/2 మిగతా 3 నెలలు చెల్లిస్తారు.

# భారత ఆర్థిక పరిస్థితులు

డా॥ వై. రాధాకృష్ణమూర్తి.

(గతసంచిక తరువాయి)

## సంస్థాగతమైన సర్దుబాట్లు

1944లో ప్రపంచంలో వున్న 155 దేశాలు 'బ్రిటన్‌వుడ్' అనే చోట సమావేశమై ప్రపంచబ్యాంక్, ఐ. యం. యఫ్ (I.M.F) గాట్ (GATT). అనే మూడు సంస్థల్ని ఏర్పాటుచేసుకొన్నారు. వీటిలో మొదటి రెండూ అప్పులిచ్చే సంస్థలు. విదేశీ కరెన్సీ చెల్లింపులలో వ్యత్యాసాలు సంక్షోభం వచ్చిన దేశాలకు అప్పులు యిస్తుంటాయి. ఈ సంస్థలకు నిదులు వివిధ దేశాలనుండి ఈ క్రింది విధంగా సమకూర్చుకొంటాయి. అమెరికా 19%, ఇంగ్లాండ్ 6.5% జపాన్ 4.6% చైనా 2.6% ఇండియా 2.2% ఈ ఆర్థిక సంస్థల పాలకవార్గాలలో అభివృద్ధిచెందిన దేశాల పారిశ్రామిక వేత్తలుంటారు. వారే ఈ సంస్థల డైరెక్టర్లు ఈ సంస్థల రూల్స్ రెగ్యులేషన్స్ అన్నీ వారి ప్రయోజనాల కనుగుణంగా రూపొందించబడతాయి. అభివృద్ధి చెందుతున్న దేశాలకు యిచ్చేరుణాల మొత్తం, తీర్చవలసిన వాయిదాల సంఖ్య, వడ్డీరేట్లు అన్నీ బ్యాంకు యాజమాన్యం నిర్ణయిస్తుంది.

## వాణిజ్య సుంకాల సాధారణ ఒప్పందం (GATT)

వివిధదేశాల మధ్య వ్యాపార సంబంధాలకు కస్టమ్స్ సుంకాలకు సంబంధించిన ఒప్పందం ఇది. పేదదేశాలు విదేశీకరెన్సీ చెల్లింపు సమస్యను ఎదుర్కొంటాయి. దీనిని అధిగమించేందుకు అప్పుకొరకు పోవాలి. ఇచ్చేవాడికి పుచ్చుకొనేవాడులోకువ. అప్పుల నుండి బయటపడాలంటే ఈ పద్ధతుల్ని కూడా పుచ్చుకొనేవాణ్ణి మరికొంత అణగద్రొక్కి యిచ్చేవాడి ప్రయోజనాలను కాపాడేవిధంగానే వుంటాయి. అలాగే ఈ అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థలు వాణిజ్యఒప్పందం పేరుతో పేదదేశాలకు కొన్ని ఉచిత సలహాలు సూచనలు చేస్తాయి. సలహాలు సూత్రాలు అనేవి నాజూకైన పదజాలం. ఈ పదజాలం ముసుగులో కొన్ని షరతులు విధిస్తారు.

షరతుల విధింపు రెండుస్థాయిలలో జరుగుతుంది. మొదటిదశ స్థిరీకరణదశ. ఈ దశలో విధింపబడే షరతులు

1) మీకరెన్సీ విలువను తగ్గించుకొనండి.

2)సామాజిక రంగానికి (విద్యావ్యాప్తికి) పెట్టేఖర్చులు తగ్గించుకొనండి.

3) సబ్సిడీలు తగ్గించండి; ధరలను అదుపుచేయండి.

4) వేతనాలను అదుపుచేయండి.

## రెండవదశ సంస్థాగత సర్దుబాటు స్థాయి.

## ఈ దశలో విధించబడే షరతులు

1) వర్తకవ్యాపారాల్ని సరళీకృతం చేయండి

2) బ్యాంకింగ్ రంగాన్ని సరళీకృతం చేయండి

3) పరిశ్రమల్ని ప్రైవేటీకరించండి

4) ప్రభుత్వ యాజమాన్యంలో సామాజిక బాధ్యతల్ని చేపట్టకండి

5) పన్నుల విధానాన్ని మార్చుకొనండి

6) కార్మికచట్టాలను మార్చుకొనండి.

## నూతన ఆర్థిక విధానాలు - బడ్జెటు రూపకల్పన ఫలితాలు

అంతర్జాతీయ సంస్థలు సూచనల పేరుతో విధిస్తున్న షరతులను మనం ఏ మేరకు పాటిస్తున్నామో పరిశీలిద్దాం.

దిగుమతి వస్తువుల మీద విధింపబడే కస్టమ్స్ డ్యూటీ 110% నుండి 35% తగ్గించబడింది రూపాయి విలువ తగ్గింపబడింది. 1991 జులై 20న ఒక్కరోజులోనే రూపాయి విలువ రెండుసార్లు తగ్గించబడింది. ఆవిధంగా రూపాయి విలువ 28% తగ్గించబడింది.

గతంలో ఏదైనా పరిశ్రమల్లో విదేశీపెట్టుబడి 30శాతానికి మించి వుండరాదనే నియమం ఉండేది. ఆచరణలో 26%కి పరిమితం చేయబడింది. తరువాత విదేశీ ఒత్తిడి ఫలితంగా దానిని 40%కి పెంచబడింది. ఆర్థిక మంత్రి మన్‌మోహన్‌సింగ్ నూతన ఆర్థిక విధానంతో ముందుకు వచ్చారు. సాంకేతిక పరిజ్ఞానాన్ని కలుపుకొని విదేశీపెట్టుబడులు వస్తే 51% వరకు అనుమతించాలన్నారు. ఫలితంగా విదేశీపెట్టుబడిదార్లు యాజమాన్యంలోకి వచ్చారు.

ఒకసారి విదేశీపెట్టుబడిదారులు మన ఉత్పత్తిరంగంలోకి ప్రవేశించాక చాలాచాలా చెపుతున్నారు. వ్యవసాయ ఉత్పత్తులను ఉపయోగించుకొనడం మీకు చేతకావడం లేదు, కనుక వృధా అవుతున్నాయన్నారు. ఎలా ఉపయోగించుకోవాలో మేము నేర్పుతాము అన్నారు. పండ్లరసాలను టిన్స్‌లో నిల్వ చేసుకోండి అన్నారు. సండ్లరసాలను నిల్వచేయడానికి ఎలాంటివిదేశీసాంకేతిక పరిజ్ఞానం అక్కర్లేదు.

గతంలో కొన్ని వస్తువుల ఉత్పత్తి చిన్న పరిశ్రమలరంగానికి కేటాయించబడింది. అలాంటి వస్తువులు దాదాపు 67 వుండేవి. కొన్ని వస్తువులను ఆజాబితానుండి తొలగించారు. అంటే చిన్నపరిశ్రమల రంగానికి రక్షణ లేకుండాపోయింది. ఫలితంగా చిన్నపరిశ్రమలు దెబ్బతిన్నాయి.

పన్నుల విధానం అవసరమే దానిలో భేదాభిప్రాయంలేదు. కాని ఎవరిమీద వేయాలి? ఎవరిమీద వేయగూడదు అనే దానిలోనే తేడావున్నది. ఐ.యం. యఫ్. ప్రత్యక్షపన్నులు పెంచకూడదు అంటుంది. అంటే సంపన్నుల మీద పన్నులు వేయకూడదు అని ఆదేశించింది. ఫలితంగా గత బడ్జెట్‌లో 2500కోట్ల వరకు పరోక్షపన్నులు పెంచారు. ప్రత్యక్ష పన్నులు తగ్గించారు. 3500కోట్ల విలువలగల పబ్లిక్‌షేర్లు అమ్మివేశారు. 1,40,000 కోట్ల విలువగల పబ్లిక్‌రంగంనెమ్మిదిగా ప్రైవేటురంగం చేతుల్లోకి పోతుంది. 51 శాతం విదేశీపెట్టుబడులకు అనుమతి యిచ్చినందువలన పబ్లిక్ రంగం క్రమక్రమంగా విదేశీ ప్రైవేటురంగం యాజమాన్యం క్రిందికి పోతుంది.

## సబ్సిడీల కత్తిరింపులు

ఉత్పత్తిపెంచడానికి వ్యవసాయరంగంలో ఎరువులకు పురుగుమందులకు విత్తనాలకు సబ్సిడీలుయిచ్చి రైతుకు సదుపాయం కల్పించబడుతున్నది.

విదేశీమారక ద్రవ్యంలోటురాకుండా ఎగుమతులు ప్రోత్సాహింపబడుతున్నాయి. పేదప్రజల ఆకలి, కనీసావసరాలు తీర్చడానికి

## క్రమ శిక్షణ, ఉత్తమ ఫలితాలే లక్ష్యంగా పెట్టుకొన్న విద్యాసంస్థ

స్థాపితం : 1985

ఫోన్స్ : 33810 (S),, 33921 (R)

# నోబుల్ పబ్లిక్ (రెసిడెన్షియల్) స్కూల్

[illegible]

**VI to X విద్యార్థులకు కంప్యూటర్ శిక్షణ**

1993-1994 విద్యాసంవత్సరంలో VII మరియు X క్లాసుల ఫలితాలు

గత యేడాది 7వ తరగతిలో 500 లకు పైగా వచ్చిన విద్యార్థుల మార్కుల వివరాలు.

1. వి. స్వప్న - 538 2. కె. కిరణ్‌కుమార్ - 516 3. జి. రాగవమ్మ - 513

4. కె. మైథిలి - 506 5. యన్. సరళ - 504 6. బి. తిరుపతిరావు - 501

| VII క్లాసు | X క్లాసు |
|---|---|
| హాజరైన విద్యార్థుల సంఖ్య - 42 | హాజరైన విద్యార్థుల సంఖ్య - 25 |
| కృతార్థులైన విద్యార్థుల సంఖ్య - 39 | కృతార్థులైన విద్యార్థుల సంఖ్య - 20 |
| 60% పైగా వచ్చిన విద్యార్థుల సంఖ్య - 30 | I క్లాసులు - 14 |
| | II క్లాసులు - 06 |
| | ----- |
| | 20 |
| | ----- |

[illegible]

స్కూలు పున: ప్రారంభం - 8.6.94 నుండి

అడ్మిషన్లు ఎంట్రన్స్ టెస్ట్ ద్వారా తీసికొనబడును. పరిమితమైన సీట్లు మాత్రమే కలవు.

బాలురకు బాలికలకు వేర్వేరుగా హాస్టలు వసతి కలదు.

పాతూరి కోటేశ్వరరావు గా॥ అధ్యక్షులు M.Sc.,

డా॥ దిగుమర్తి భాస్కరరావు కరస్పాండెంటు M.A., M.Sc., M.Ed., Ph. D.

గంటా నాగేశ్వరరావు M.A., సెక్రెటరి

జి. ఉషారాణి కో ఆర్డినేటర్

జి. సులేఖ M.A., B.Ed., ప్రిన్సిపాల్

సమర్థులైన విద్యావేత్తల పర్యవేక్షణలో

---

1994లో 100% ఫలితాలు సాధించి పురోగమిస్తూ అందరి ప్రశంశలందుకొంటున్న

# విద్యానికేతన్ డే అండ్ రెసిడెన్షియల్ స్కూలు

పండరీపురం, 4వలైను, గుంటూరు

10వ తరగతిలో 1993 సం॥లో 97%, 1994 సం॥లో నూరుశాతము ఫలితాలు, 7వ తరగతిలో నూరు శాతం ఫలితాలు సాదించి, పాలిటెక్నిక్, ఎ.పి.ఆర్.జె.సి. లలో అత్యధిక సీట్లు సాధించి అగ్రగామిగా నిలిచిన సంస్థ విద్యానికేతన్

## 10వ తరగతి - ఫలితాలు

| సం॥ము | హాజరైన విద్యార్థులు | ప్రథమ శ్రేణి | ద్వితీయ శ్రేణి | తృతీయ శ్రేణి | శాతము |
|---|---|---|---|---|---|
| 1993 | 65 | 45 | 15 | 3 | 97% |
| 1994 | 51 | 25 | 21 | 5 | 100% |

**అడ్మిషన్లు ప్రారంభమైనవి, తరగతుల ప్రారంభము : 11-6-94.**

డి. శ్రీశైలమల్లికార్జునరావు

రిటైర్డు హెడ్‌మాష్టరు

డైరెక్టరు

బియ్యం, గోధుమలు, పంచదార, ధోవతులు, చీరెలు లాంటి వాటిపై నబ్బిడీలు ఇవ్వబడుతున్నాయి. ఇలాంటి నబ్బిడీలను రద్దుచేయమంటున్నాయి ప్రపంచబ్యాంకు, ఐయం.యంఫ్‌లు

నూతన ఆర్థిక విధానాన్ననుసరించి నష్టాలు వస్తున్న పరిశ్రమలు మూసివేయబడుచున్నాయి. లాభాలు వస్తున్న పరిశ్రమలు అమ్మివేయబడుచున్నాయి. ఇప్పటికి 250లక్షల పరిశ్రమలు మూతపడ్డాయి. జబ్బువచ్చిన పరిశ్రలు(Sick Industries) బి.ఐ.యఫ్. ఆర్ రిఫర్‌చేయబడుతున్నాయి. రాయలసీమ పేపర్‌మిల్, ఐ.డి.పి.యల్‌తో సహా అనేకవేల పరిశ్రమలపై సిక్ ఇండస్ట్రీస్ ముద్రవేయబడింది. మరి కార్మికుల పరిస్థితి ఏమిటి? ఏడాదికి కోటిమందికి ఉపాధికల్పిస్తామన్న వాగ్ధానాలు ఏమయ్యాయి? అదనంగా ఉపాధికల్పన మాట అలావుంచి కోటిమందికి పైగా కార్మికుల ఉపాధి కోల్పోవుచున్నారు గోల్డెన్‌హ్యాండ్‌షేక్‌లు అంటున్నారు లేబర్‌చట్టాలు మార్చాలంటున్నారు.

లోటుబడ్జెట్లు ప్రవేశపెట్టడం, లోటునుభర్తీచేయించేందుకు ఆర్.బి.ఐ. చేతనోట్లు అచ్చుగుద్దించడం, ఆమేరకు ధరలు పెరగడం సామాన్యమైపోయింది. 1992-93 కేంద్రబడ్జెటులోటు 17000 కోట్లు, రాష్ట్రబడ్జట్లు లోటు 7వేలకోట్లు, మొత్తంలోటు 24 వేల కోట్లు ద్రవ్యలోటు తగ్గించుకోవాలంటే ఆదాయం పెంచుకోవాలి. ఖర్చులు తగ్గించుకోవాలి. ఆదాయం పన్నుల ద్వారా, అప్పులద్వారా, ప్రభుత్వ సంస్థలద్వారా సమకూర్చుకోబడుతున్నది. ఆర్.బి. పీకి 1500కోట్లు, పబ్లిక్‌రంగ సంస్థలు 800కోట్లు యల్.ఐ.సి. 100కోట్లు, జి.ఐ.సి 100 కోట్లు సేకరించాలని కోటాలు యివ్వబడ్డాయి. షేర్‌మార్కెటును హర్షద్‌మెహతాకిచ్చి జూదమాడమన్నారు. 8000 కోట్లకు పైగా ప్రజాధనం స్వాహాచేయబడింది. మన ఆర్థికవిధానం జూదమాడే విధంగా తయారయింది.

జానకిరామన్ కమీషన్, సి.బి.ఐ కమీషన్, జాయంట్ పార్లమెంటరీ కమీషన్‌లు నియమింపబడ్డాయి. 18 నెలలకాలం దర్యాప్తుచేశాయి. జె.పి.సి ప్రభుత్వ డిపార్టుమెంటుని మందలించింది. ఆర్థికమంత్రి మొద్దునిద్రపోతున్నాడని జె.పి.సి. మందలించింది. కాని జె.పి.సి. సమర్పించిన నివేదికకు చిత్తుకాగితానికి యిచ్చే విలువ కూడా యివ్వలేదు. ప్రభుత్వం.

## సరళీకృత ఆర్థికవిధానం

మీ దేశం యొక్క ఆర్థికవ్యవస్థను ప్రపంచ ఆర్థికవ్యవస్థకి అనుసంధానం చేయండి. అలాచేయడాన్నే గ్లోబలైజేషన్ అంటున్నారు. ఒక దేశం మరొకదేశంతో వస్తుమార్పిడి వాణిజ్యం చేస్తుంటాయి. సంపన్నదేశాలుమూడవప్రపంచదేశాలకు ఎగుమతులు ఎక్కువగా చేస్తూ దిగుమతులు తక్కువ చేసుకొంటాయి. ఈ లావాదేవీలు కరెన్సీ (డాలర్ల) లో జరుగుతాయి. ఇలా జరగాలని ఐ.యం.యఫ్. నిర్ణయిస్తుంది. దీనిని అంతర్జాతీయ వ్యాపారం అంటున్నాం.

ఇలాంటి వ్యాపారం నిర్వహించడానికి పెద్ద అంతర్జాతీయ వ్యాపారసంస్థలువున్నాయి. వాటికి ఒక దేశంలో పెద్ద పరిశ్రమవుంటుంది. దాని శాఖలు అనేక దేశాలలో వుంటాయి. ఉదాహరణకు బహుళజాతి వ్యాపారసంస్థ ఆధ్వర్యంలో కార్ల పరిశ్రమవున్నది. దానికి వివిధ దేశాలలో శాఖలు వుంటాయి. ఒక్కొక్కదేశంలో ఒక్కొక్క పార్టు తయారవుతుంది. ఆపార్టులన్నీ కలిపితే కారు అవుతుంది. కారు ధరని నిర్ణయించేది వ్యాపారసంస్థ.

ఒక దేశం ఎగుమతుల కంటె దిగుమతులు ఎక్కువ చేసుకొంటే విదేశీకమారకద్రవ్యంలో లోటువస్తుంది. ఈ లోటుకు భర్తీ చేయాలంటే ఐ.యం.యఫ్. ప్రపంచబ్యాంకులాంటి సంస్థలనుండి అప్పులుచేయవలసివస్తుంది. అప్పులు తీర్చడానికి అప్పులు చేసే పరిస్థితి కారణంగా దేశం అప్పుల సుడిగుండంలో చిక్కుకుంటుంది.

## బిలియం డాలర్లలో

| మన అప్పులు | దిగుమతులు | ఎగుమతులు | లోటు |
|---|---|---|---|
| ఇందిరాగాంధి 1980-81 | 15.8 | 8.3 | 7.5 |
| రాజీవ్‌గాంధీ 88-89 | 23.6 | 14.2 | 9.4 |
| చంద్రశేఖర్ 90-91 | - | - | 8.9 |

యన్.ఆర్.ఐలకు 1.3 బిలియన్లడాలర్లు వెళ్లిపోతున్నాయి. మన్‌మోహన్‌సింగ్ ఆర్థికమంత్రి అయినతరువాత

| | | | |
|---|---|---|---|
| 91-92 | 19.4 | 17.8 | 1.6 |
| 92-93 | 21-7 | 18.4 | 3.3 |
| 93-94 | 25.0 | 21.0 | 4.0 |

మొత్తంలోటు 8.9+4.0 అంటె 12-9 బిలియన్‌డాలర్లలోటు.

లోటు పూడ్చాలంటే 34 బిలియన్‌డాలర్ల ఎగుమతులు చేయాలి, తెచ్చుకొనే అప్పులో 95శాతం వాయిదాలు చెల్లించేందుకు సరిపోతుంది. దేశంఅప్పుల సుడిగుండంలో పడిపోతుంది.

## ప్రభుత్వరంగం - ప్రైవేటురంగం

పబ్లిక్‌సెక్టర్: 1,13,000 కోట్ల పెట్టుబడితో 82 రకాల వస్తువుల ఉత్పత్తి జరుగుతుంది. వాటిపై 4414కోట్ల లాభాలు వస్తున్నాయి. మరో 79 వస్తువుల ఉత్పత్తి జరుగుతుంది. వాటిపై 23-76 కోట్లరూపాయలు నష్టవస్తున్నది. అంటే నికరలాభం 2368 కోట్లు.

ప్రభుత్వరంగ సంస్థలన్నిటా నష్టాలే వస్తున్నాయని, అందువలన వీటిని ప్రైవేటుపరం చేయాలని విస్తృతంగా ప్రచారాలు జరుగుతున్నాయి. ప్రభుత్వరంగసంస్థలు అన్నీ నష్టాలనే తెచ్చిపెడుతున్నాయనటం అవాస్తవం - ప్రభుత్వరంగంలో పరిశ్రమలు స్థాపించడం సామాజిక అవసరం. సామాజిక ప్రయోజనాన్ని కేవలం లాభనష్టాలతో బేరీజువేయడం సరియైన చర్యకాదు: గుత్తపెట్టుబడిదారులు. బాగా బలపడి ప్రభుత్వరంగాన్ని కొనేస్థితికి ఎదిగారు. వారే ప్రభుత్వరంగసంస్థలు దివాళాతీస్తున్నాయని ప్రచారాలు సాగిస్తున్నారు. ఒక పరిశ్రమ అభివృద్ధిచెందాలంటే పెట్టుబడులు కొత్త యంత్రపరికరాలు సాంకేతిక నైపుణ్యం అవసరం. కాని పెట్టుబడులు పెట్టకుండ మూతి ఎండగట్టి లాభాలు లాభాలు అనికేకలేస్తే ఎలావస్తాయి? ఉత్పత్తిలో కార్మికునికి యిచ్చే జీతం 10నుండి 15 శాతం మాత్రమే. లాభాలు రాకపోవడానికి కేవలం కార్మికుల్ని బాధ్యుల్నిచేయడం అర్థంలేని పని. స్వదేశీవిదేశీ పెట్టుబడిదారులు కుమ్మక్కయి ఒక పథకం ప్రకారం ప్రభుత్వరంగ సంస్థల్ని దివాలా తీయించడానికి ప్రయత్నాలు సాగిస్తున్నారు.

## సామాన్యుడు సైన్సు శాస్త్రజ్ఞుడు

డాక్టర్ యం. బాబూరావు

కొండగుహల చీకటినుండి విశ్వాంతరాళాల వెలుగులోనికి, చీకటివెలుగులు పెనుగాలులు కుంభవృష్టి కార్చిచ్చు లాంటి ప్రకృతి పరమైన ఘటనలు ఏవి ఎందుకు ఎలా జరుగుతున్నాయో తెలియని స్థితి నుండి ఆఘటనలు ఎందుకు జరుగుతున్నాయో కారణాలను తెలుసుకొనడమేగాక ఒకమేరకు వాటిని నియంత్రించగల స్థితివరకూ, ఆటవికదశనుండి ఆధునిక నాగరికత వరకూ సాగిన మానవప్రస్థానం నిరంతరశ్రమఫలితంగాను శ్రమ అనుభవాలనుండి నేర్చుకొన్న గుణపాఠాలవలనూ సాధ్యపడింది. ముందుకాళ్లను చేతులుగా మార్చుకొనగలగడం, బొటనవ్రేలి అభివృద్ధి, నిప్పును కనుగొనడం మానవనాగరికతా ప్రస్థానంలో మైలురాళ్లు, మానవుడు తాను సాగిస్తున్న జీవితంకంటే మెరుగైన జీవితంకొరకు చేసిన నిరంతరశ్రమ, అన్వేషణల ఫలితంగానే ఈపురోగమనం సాధ్యపడింది. సమాజం అభివృద్ధి కొరకు గనిలో, వనిలో కార్ఖానాలో నిరంతరం శారీరక మానసిక శ్రమచేసేవారు సామాన్యులు.

తన పరిసరాలను, ప్రకృతిని అర్థంచేసుకోవడానికి మనిషి అవలంబించిన పద్ధతి. తరతరాలుగా ప్రోగుపడిన, క్రోడీకరించబడిన నరజాతి అనుభవం-కృషిసైన్సు. ఏది? ఏమిటి? ఎక్కడ? ఎలా? ఎవరు? ఎందుకు? అని జనంప్రశ్నిస్తూ సాగించిన సమిష్టికృషి (ఆచరణ) ఫలితం శాస్త్రవిజ్ఞానం. సైన్సును సృష్టించింది సూత్రాలను వెలికి తీసింది కష్టపడే సామాన్యజనమేతప్ప శాస్త్రవేత్తల తలలనుండి సైన్సు ఊడిపడలేదు.

మనిషికి తన అనుభవాలు-అభిరుచులు ఆలోచనలు క్రమబద్ధీకరించి ఆచరణలోపెట్టేశక్తి మెదడు ద్వారాలభించింది. పరిశీలన, ప్రయోగం (ఆచరణ), సూత్రీకరణ మరియు నిరూపణ (ఋజువుచేయటం) అనేదశలద్వారా మనిషి అన్వేషణ సాగుతుంది. దీనికిగాను అప్పటికి అందుబాటులోవున్న సమాచారాన్నంతటిని మనిషి వినియోగించుకుంటాడు. క్రొత్తక్రొత్త పరికరాలు ఉపయోగంలోకివస్తాయి. నూతన సాంకేతిక పదాలు సృష్టించబడతాయి.

### శాస్త్రవేత్త-సామాన్యుడు

ఒకానొక విజ్ఞాన శాస్త్రరంగంలో నిష్ణాతుడు. తను కృషిచేస్తున్న రంగంలో శాస్త్రపద్ధతిలో పనిచేసేమనిషి ఆరంగంలో సైన్సుప్రారంభాన్ని, అభివృద్ధిని, సమస్యలను అధ్యయనంచేసే మమూలు మనిషి శాస్త్రవేత్త. శాస్త్రరంగంలోని పై స్థాయి కార్యకర్తశాస్త్రవేత్త.

రోగిలేకుండా వైద్యుడు లేనట్లే, సామాన్యజనం (ఉత్పత్తిరంగంలోని కార్మికులు) లేకుండా శాస్త్రవేత్త మనజాలడు. శాస్త్రవేత్త సామాన్యజనంలోంచి, వారందించే అన్నిరకాల సేవలను, సమకూర్చేసౌకర్యాలను వినియోగించుకుని తయారౌతాడు.

శాఖోపశాఖలుగా విస్తరించిన విజ్ఞాన శాస్త్రానికి శాస్త్రవేత్త తల్లి వేరులాంటివాడు. విజ్ఞానశాస్త్రసారాన్నంతా గ్రహించి దేశాభివృద్ధికి కృషిచేస్తున్న కర్షకులకు కార్మికులకు అందించటం నేడు శాస్త్రవేత్త కర్తవ్యం. మన ఉత్పత్తిరంగాలు సృజనాత్మకంగా, కొత్తదనంతో ముందడుగు వేయాలంటే సామాన్యుడు శాస్త్రవేత్త ఒక్కటిగా సమిష్టికృషిచేయవలసివుంది.

## మనిషి ప్రకృతిని జయించాడా?

"ఆదియందువాక్యమువుండెను
వాక్యముదేవుడైవుండెను"

"దిగంతాలకు వినిపించే ఓంకారనాదంలోంచి ఆదిశక్తిజనించి, త్రిమూర్తులను సృష్టించెను"

'వాక్యము' 'ఓంకారధ్వని' లిపివిజ్ఞానంలేని అనాగరిక సామాజికదశను తెలియజేస్తున్నాయి. ధ్వని, శబ్దము, శృతి అనేవిచలనంలో గల భౌతిక పదార్థంయొక్కలక్షణాలు. వెలుతురు, వేడిమి, ప్రకంపనాలు కూడపదార్థధర్మాలే. అంటే అనాగరిక మానవుడు దేన్నైతే "అతీతశక్తి" అని వర్ణించాడో అదివాస్తవానికి పదార్థానికి సంబంధించిన తన ఊహలేదా అనుభూతి మాత్రమే.

ప్రకృతి అంటే పదార్థము దాని యొక్క రూపాలు మాత్రమే.

"తొలుత పదార్థము వుండెను
పదార్థము చలనములోవుండెను"

అని నేడు సైన్స్ విశ్లేషణలో అర్థమౌతోంది.

ప్రకృతి పదార్థనిర్మితము, ప్రకృతినిరంతర గతిశీలమైనది. నిరంతరచలనం వలన వివిధరూపాలు రూపాంతరాలు ఏర్పడి, నిరంతరం శక్తిజనిస్తూవుంది. ప్రకృతి సూత్రబద్ధమైన, శాస్త్రీయమైన చలనంలోవుంది, అభివృద్ధి పథంలోవుంది.

పదార్థం-దాని చలనం మనిషి పుట్టుకకు ముందు నుండే ఉనికిలోవున్నాయి. జీవపదార్థపరిణామం యొక్క అత్యున్నత రూపమే "మనిషి"మనిషి ఉనికిలోకి వచ్చాక ప్రకృతిలో భాగమైన పరిసరాలను పరికించటం, పరిశీలించటం మొదలుపెట్టాడు. భూమి బల్లపరుపుగా వుందని ప్రాచీనమతగ్రంథాలలో నమోదుచేశాడు. భూమి స్థిరంగావుందని, సూర్యుడే భూమిని చుట్టివస్తున్నాడని అనుభూతి చెందాడు. పగలు, రాత్రి, అగ్ని, ఆకలి, వర్షాలు అతీతుడు తనకోసం సృష్టిస్తున్నాడని విశ్వశించాడు మనిషి. చావు-పుట్టుక నుండి చివరకు తానే సృష్టిస్తున్న సంతతను కూడా ఎవరో ప్రసాదిస్తున్నాడని నమ్ముతున్నాడు.

కాని ఆచరణలో, నిత్యజీవితసమరంలో ప్రకృతి ధర్మాలను కనుగొనడం సాధ్యమయింది. గోథె అనేతత్వవేత్త అన్నట్లు అప్పుడు, యిప్పుడు ఉన్నది ఒక్కటే-ఆచరణ, ఆచరణ, ఆచరణ. ఆచరణలో వాస్తవమని తేలిన దాన్ని 'సత్యం' అనుకున్నాడు. అప్పటికున్నవిశ్వాసాలు, నమ్మకాలు తారుమారై"వాస్తవికత" ముందడుగువేసింది.

మనిషి ప్రకృతిని జయించలేదు; కాని తాను ప్రకృతిమాత ఒడిలో శిశువునని గ్రహించాడు. తనమనుగడకు కావలసిన వనరులన్ని సమృద్ధిగాప్రకృతిలో వున్నాయని తెలుసుకొని, వాటిని సమర్థవంతంగా వినియోగించుకుంటున్నాడు.

### శాస్త్రంఎలా అభివృద్ధిచెందింది?

అభివృద్ధి అంటేమార్పు. పదార్థం ఒకానొక స్థితి నుంచి మరొక ఉన్నతస్థితికి చేరటాన్ని అభివృద్ధిఅంటాం. అభివృద్ధి దానంతట అదే జరిగినట్లు కనిపించినా దానంతట అదిసంభవించదు. అభివృద్ధి చెందటానికి ప్రధానంగా రెండు కారణాలు వుంటాయి. ఒకటి అంతర్గత కారణాలు రెండు బాహ్యకారణాలు.

ప్రకృతిలోను, సమాజంలోను, జీవితంలోను పరస్పరవిరుద్ధ అంశాలమధ్య సంఘర్షణే అభివృద్ధికిమూలం. అట్టి సంఘర్షణనుంచి తప్పించుకోవటం, పారిపోవడంసాధ్యంకాదు. అట్టిసంఘర్షణలో అభివృద్ధికి అనుకూలంగాను, వ్యతిరేకంగా (అభివృద్ధికర; అభివృద్ధినిరోధక ధోరణులు ఆచరణ పోటీపడతాయి. సైన్సు యొక్క అభివృద్ధికి అడుగడుగున అడ్డుతగిలింది మతం.

'మతం' అనేది వ్యక్తిగత విశ్వాసం. అది అనాగరిక సమాజంలో జనంలో ఒకరకమైన ఐక్యతను, క్రమశిక్షణను ప్రవేశపెట్టి సామాజిక అభివృద్ధికి దోహదపడింది. అయితే ఆవిశ్వాసాన్ని చాటుకోవడానికి, తను నమ్మినశక్తిని వశపర్చుకోవడానికి నాటిమనిషి ప్రవేవపెట్టిన కర్మకాండమాత్రం అత్యంత మొరటుగా, అనాగరికంగా, పాశవికంగా కూడ వుండేది. ఉదాహరణకు యజ్ఞయాగాలు, హోమాలలో నరబలి, జంతుబలులు పూర్తివిశ్వాసంతో సమర్పించేవారు. ఆనాటి ఆచారాలు, ఆహారవుఅలవాట్లు కూడా అవి కొంతకాలం కొనసాగటానికి అనుమతించాయి.

మతాన్ని హృదయసంబంధమైన విషయంగా కాక నేటి ఆధునికమానవుడు తన అవసరాలు, ఆకాంక్షలు నెరవేర్చగల సాధనంగా చూస్తున్నాడు. మనిషి గుండెలో ప్రేమ, కరుణ, దైవత్వాన్ని సమాధిచేసి వీధివీధికో ఆలయం నిర్మించాలని పోటీపడుతున్నాడు. నాటిబలిపశువు మాంసంగాని, నేటికొబ్బరికాయగాని దేవుడు తినటంలేదు.

అందుకే గురజాడ అంటారు "మనుషులు చేసినదేవుళ్లారా!, దేవుడుచేసిన మనుషుల్లారా! మీపేరేమిటి?" అని.

మతం విధించిన ఆంక్షలు, నాటిపాలక వర్గాలు పెట్టిన చిత్రహింసలు భరిస్తూ, బలియౌతూ శాస్త్రవేత్తలు సత్యశోధనకు పూనుకున్నారు. ప్రకృతిని, ప్రపంచాన్ని విశ్లేషించటంలో, విశదీకరించటంలో మతం-సైన్సు తీవ్రంగా ఘర్షణపడ్డాయి. ఈసంఘర్షణలో సైన్సు విజయంసాధించింది.

"మతములన్నియు మాసిపోవును
జ్ఞానమొక్కటే నిలిచివెలుగును".

## కులం-సైన్సు

బైబిల్, వేదాలు, ఉపనిషత్తులలోనే, నేటిసైన్స్ అంతా వుందని విశ్వసించేవారికి తెలియాల్సిన సత్యవాక్యం ఒకటివుంది. ప్రాచీన మతగ్రంథాలు నాటిసామాజిక వ్యవస్థను, అనాగరికయుగంనాటి మానవుల కార్యకలాపాలను, ఆచారవ్యవహారాలను మాత్రమే నమోదుచేశాయి. వాస్తుమొదలువైద్యం దాకా అనేకశాస్త్రవిషయాలగురించిన ప్రాథమికసమాచారంవాటిలోవుంది. అయితే అవిఆనాటి జనం ఆచరించినవి, ఊహించినవితప్ప నేటిఆధునికసమాజ అవసరాలకు తగినవికాదు. పురాతనకాలంనాటి సైన్సు, ఆచరణతో సంబంధంలేని కల్పనలు, అతిశయోక్తులు, అర్ధసత్యాలుమాత్రమే. అంతకు మించిన గొప్పతనం వాటికి ఆపాదించటంపొరపాటు. కులాల ప్రస్తావనవాటిలోలేదు.

మానవుల యొక్క జీవనకార్యకలాపాలు పెరిగేకొద్దీ, వ్యక్తి యొక్క, సమాజంయొక్క అవసరాలు పెరిగేకొద్దీ ప్రతిమనిషి ఏదోఒకకృత్తి (అవసరమైనది, అందుబాటులో వున్నది) చేసుకొని పొట్టపోసుకోవలసి వచ్చింది.వృత్తులను బట్టి కులాల విభజనవచ్చిందనే దానికే ఎక్కువాధారాలువున్నాయి. ఏవృత్తినిచేపట్టినాకడుపునింపుకోవటం ప్రధానం."నీచవృత్తులు, ఉన్నతవృత్తులు అనేతేడామొదట్లోలేదు.

శ్రమసాధనాలు (ఉత్పత్తి పరికరాలు) ప్రవేశించాక, శారీరకశ్రమకంటే యాంత్రికశ్రమకు ప్రాధాన్యత పెరిగింది. మనస్సుకూడా శరీరంలో భాగమే అయినా మానసికశ్రమచాలా గౌరవనీయమైనదిగా భావించబడుతోంది. వృత్తినైపుణ్యం పెరిగేకొలది మనిషి వెచ్చించేశారీరక శ్రమ గంటలు తగ్గిపోవటం జరుగుతుంది. శ్రమను సరుకుగా అమ్మటంకొనటం జరిగేనాటిసామాజిక వ్యవస్థలో ఇదిఏవృత్తి (కులం) శ్రమ అని అమ్మేవాడు కాని కొనేవాడుగాని పట్టించుకోడు.

సమాజం ఒకానొక చారిత్రక దశలో వున్నప్పుడు కులవ్యవస్థ (వృత్తులు) అవసరమయ్యాయి. సమాజంముక్కలుగావిడిపోయింది,దేవుళ్లనుకూడా, కులాలవారీ పంచుకొన్నారు. కాని ఆదునికసామాజిక వ్యవస్థలో కులంమొక్క అవసరం లేదు. కులవిభజన అశాస్త్రీయమైనది, అన్యాయమైనది. కులనిర్మూలన కోసం ఎన్నోఉద్యమాలు,పోరాటాలు సాగాయి. అందుచేతనేకుల పట్టింపులు తగ్గుముఖంపట్టాయి.

కొడుకురక్తం తండ్రికిసరిపోదు. ఒకేకులంవారి రక్తం ఒకటికాదు. అయినప్పుడు సామాజిక పుట్టుమచ్చగా మిగిలిన ఈకులంఎంత వరకు సబబు? విశ్వమానవులందర్నీ రక్తంగ్రూపులరీత్యా వర్గీకరిస్తే నాలుగు కులాలేమిగులుతాయి. 'ఎ' గ్రూపు రక్తం కలిగినవాడు ఏకులంవాడైనా, ఏమతం వాడైనా, ఏదేశం, ఏజాతివాడైనా 'ఎ' గ్రూపురక్తం ఇచ్చిఆదుకోగలడు. ఈ బాంధవ్యాన్ని, బంధుత్వాన్ని శిథిలమైపోతున్నకులవ్యవవస్థకాదనగలదా? శ్రమదోపిడీరీత్యా చూస్తే విశ్వమంతా రెండేకులాలు మిగులుతాయి. శ్రమదోపిడీకి గురయ్యే వారు, శ్రమను దోచుకుని కులికేవారు. ఈఘర్షణకు దూరంగా కులాలువుండగలవా?

## సామాన్యులు-మూఢనమ్మకాలు

అనాదిగా మనిషి ఆశాజీవి, కలలు కనడం, కలలు నిజంచేయడం అతని దినచర్య. దేన్నైనా నమ్మడంలో తప్పులేదు, కాని అదితనను కించపరుస్తున్నా, దిగజారుస్తున్నా తీవ్రనష్టానికి గురిచేస్తున్నాకూడా నమ్మడమంటే దాన్ని మూఢనమ్మకమనాలి.

సామాన్యులు అట్టి మూఢనమ్మకాలలో చిక్కుకుని తమసమయాన్ని, ధనాన్ని, శీలాన్ని వృధాచేసుకుంటున్నారు. దీనికి ప్రధానకారణం సైన్సు ఫలితాలు సామాన్యులకు అందుబాటులో లేకపోవటమే. శాస్త్రఫలితాలు ప్రజలకు ఎందుకు అందుబాటులో లేవు? మన ప్రజలకు సైన్సు ఫలితాలు తప్ప మిగతావన్నీ అనుభవంలోవున్నాయా?

మన ప్రజలందరికి మంచి ఆహారంవుందా? మంచినీటి సౌకర్యంవుందా? చేతినిండా పనులున్నాయా? పనికితగిన వేతనాలున్నాయా? ఒకేపనికి మహిళలకు తక్కువ వేతనాలెందుకివ్వాలి?

రాష్ట్రప్రభుత్వ ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు గ్రహీత

శ్రీ ఎ. సాంబశివరావుగారి ఆధ్వర్యంలో

నడపబడుతున్న సంస్థ

# జ్యోతి విద్యాలయ హైస్కూలు (రికగ్నైజ్డ్)

## తెలుగు మీడియం

- ☆ గత 6 సంవత్సరాల నుండి పదవ తరగతిలో 100% ఫలితాల్ని సాధిస్తున్న సంస్థ
- ☆ గత 4 సంవత్సరాల నుండి 100% విద్యార్థులకు ప్రథమశ్రేణినే సాధించిన సంస్థ
- ☆ జిల్లాలోని 400 హైస్కూళ్లలో గత 6 సం॥లుగా యిట్టి ఉత్తీర్ణతాశాతం ఈ పాఠశాలకే దక్కింది.

ఎ. సాంబశివరావు బి.యస్.సి., యం.ఇ.డి.

Head Master & correspondent

# జ్యోతి పబ్లిక్ స్కూల్

## ఇంగ్లీషు మీడియం

ఎ. సాంబశివరావు

correspondent

వ్యవస్థాపకులే అధ్యా[illegible]

స్థాపించిన మొదటి సంవత్సరమే 515, 510, 505

వంటి అత్యుత్తమ మార్కులు సాధించిన సంస్థ

[illegible]

4వ తరగతి నుండి 10వ తరగతివరకు

**అడ్మిషన్లు జరుగుచున్నవి**

**Talent Test** లో కూడ **First** సాధించిన సంస్థ

3 సం॥ల నుండి **7th, 10th Class** లలో

**100% Results** సాదిస్తున్న సంస్థ

Principal

**K. V. Venkateswara Rao**

బ్రహ్మానందరెడ్డి నగర్

రోడ్డు నెం. 3.

Opp to : విశాలాంధ్ర

విజయవాడ - 4

## 'డే' స్కాలర్సుకు సువర్ణావకాశం.

ప్రథమశ్రేణుల ప్రగతి పథంలో పయనిస్తూ EAMCET లో ర్యాంకుల కొరకు ముందుకు సాగుచున్న కళాశాల "

శ్రీదత్తసాయి 'డే' & రెసిడెన్షియల్ కళాశాల, చంద్రమౌళిపురం, బెంజి సర్కిల్ దగ్గర, విజయవాడ-8"

M.P.C వారికి మొదటి నుండే EAMCET కోచింగ్ M.E.C, C.E.C, H.E.C

వారికి బ్యాంకు ఉద్యోగాల పోటీ పరీక్షలకు శిక్షణ ఇచ్చుట మా ప్రత్యేకత

**బాల బాలికలకు ప్రవేశం కలదు**

**అడ్మిషన్లు జరుగుచున్నవి.**

| | |
|---|---|
| గౌరవసలహాదారులు<br>డా॥ పిన్నమనేని కోటేశ్వరరావు<br>మెడికల్ కాలేజి ప్రొఫెసరు<br>డా॥ ఇండ్ల రామసుబ్బారెడ్డి<br>సుప్రసిద్ధ మానసిక వైద్యులు | కె. రామచంద్రారెడ్డి<br>M.A.D.P.A.A.P.E.S.<br>గవర్నమెంటు కాలేజి ప్రిన్సిపాల్ |

హరిజనులు, గిరిజనులు, తరతరాలుగా ఎందుకు అణచివేతకు, ఆర్థికదోపిడీకిగురౌతున్నారు? వైద్యసౌకర్యాలు ఎందరికి అందుబాటులో వున్నాయి? దున్నేవాడిచేతిలో భూమిఎందుకులేదు? ఇవేవీ ప్రజలకు అందుబాటులోలేకుండా కేవలం సైన్సు ఫలితాలు మాత్రమే లేవనడం న్యాయమా?

అందరుశ్రమించి సృష్టిస్తున్న సంపద, సౌకర్యాలు కొందరి యాజమాన్యంలో వున్నందువలన, అకొద్దిమంది మాత్రమే సైన్సు ఫలితాలు కూడా అనుభవించేస్థితి ఏర్పడింది. సైన్స్ - సాంకేతికాలు, భూమిపైగల సకలవనరులు కొద్దిమంది హక్కు-భుక్తంగావున్నంతకాలం సామాజిక ప్రగతి ఆగిపోతుంది.

## సైన్సు-సమస్యలు

సకలసమస్యలు పరిష్కరించి, మానవజీవితాన్ని సుఖమయం చేయగల సైన్సు సమస్యలను కూడా సృష్టిస్తుందా? అవును సైన్సు ఒక సాధనం (పరికరం) అయినపుడు ఆసాధనాన్ని దుర్వినియోగం చేస్తే అన్నసమస్యలే.

"భూమాత అందరి అవసరాలను తీర్చగలదు కాని కొందరి అత్యాశనుమాత్రం కాదు" గాంధీజీ.

లాభాపేక్షతో, అత్యాశతో త్వరత్వరగాచేపట్టిన పారిశ్రామికీకరణ పెట్టుబడిదారులకు మేలుచేసినా సమాజానికి చాలకీడుచేసింది. అడవులు నాశనయయ్యాయి,తేమకరువైంది, వర్షపాతంతగ్గింది, ఋతుక్రమం మారింది, భూమి ఉష్ణోగ్రత పెరిగి, సముద్రాలు పొంగుతున్నాయి, గాలి, నీరు, నేల కాలుష్యంతో నిండిపోతున్నాయి.

వాతావరణంలో జనంవదిలే బొగ్గుపులుసువాయువు శాతంపెరిగింది. దాన్ని వినియోగించుకునే అడవుల శాతం తగ్గిపోయింది.

క్రొత్తక్రొత్త జబ్బులు ప్రవేశిస్తున్నాయి. కొన్నాళ్లకు మన కోస్తాతీరం చేపలచెరువుల పుణ్యమా అని ఎడారులుగా మారనున్నాయి. ఇప్పటికీ మనం వాడేఎరువులు, క్రిమిసంహారకాలు మనశరీరాల రోగనిరోధకశక్తిని క్షీణింపజేస్తున్నాయి.

నాటినాగసాకి, హిరోషిమాలు కాక నేటి గల్ఫ్ యుద్ధం అణుధార్మికశక్తి దుర్వినియోగానికి ఉదాహరణలుగావున్నాయి. భూగోళాన్ని కనీసం 10-12 సార్లు సర్వనాశనంచేయటానికి కావలసినంత అణుశక్తి అమెరికాచేతిలోవుందనే ప్రచారం వుంది.

ఈభూమి ఏఒక్కరి సొత్తుకాదు. ఈ భూమి, దానిపైగల వనరులు మనందరివి. వాటిని సద్వినియోగం చేసుకుందాం; సమైక్యంగా ముందుకు సాగుదాం.

## సామాజిక విప్లవసాధనం-సైన్సు

అభివృద్ధిక్రమంలో సమాజంవర్గాలుగా విభజించబడింది. ఈ వర్గకలహం ఎవరూ అనుకుని, పథకంప్రకారం ప్రవేశపెట్టిందికాదు. సమాజగమనంలో అనివార్యంగా, భౌతికంగా ఎదురైంది.

"ఆధునిక విజ్ఞానం ఒకదేవత లాంటిది. ఆదేవత ఆధునిక విజ్ఞానజ్యోతిని తనచేతిలో పట్టుకుని తరతరాలుగా పేరుకొనిపోయిన అజ్ఞానాంధకారాన్ని తొలగి వస్తూవుంది. ఆవెలుగు మూఢాచారాలనే దెయ్యాల కాళ్లకు బుద్ధిచెపుతుంది. ప్రస్తుతం సత్యాసత్యాల మధ్య; విద్యావిద్యలమధ్య; పాతక్రొత్తల మధ్య పోరాటంజరుగుతున్నది. ఈ పోరాటంలో ఎవరూతటస్థంగా వుండకూడదు. ఏపక్షంలో చేరాలో అంతిమవిజయం ఎవరిదో చెప్పనక్కరలేదు. అయితే చివరికి జ్ఞానం అజ్ఞానాన్ని, సత్యం అసత్యాన్ని తప్పక జయిస్తాయి" (వీరేశలింగం-వి.ఆర్ నార్లపేజ 49)

సంఘసంస్కర్త, కార్యశీలి కందుకూరివీరేశలింగం వందేళ్లక్రితం వ్రాసిన ఈ మాటలునేటికి వర్తిస్తాయి.

మనం ఈరోజు ఎక్కడికిపోతున్నాం? కంపెనీలు లాభాపేక్షతో చేసేప్రచారాలు నమ్మిచాక్‌లెట్లు, బిస్కట్లు, బూస్టులు, బోర్నవిటాలు మనపిల్లలకు అలవాటుచేస్తున్నాం. ఏం ఇవిమనపాలు, పప్పులు-బెల్లం, కోడిగ్రుడ్లు కన్నా బలవర్ధకమైనా? వీటిఖరీదెంత? వాటిఖరీదెంత?

పంచదార, గ్లూకోజ్ రెండు ఒకటే. $C_6 H_2 O_6$ రసాయన నామం, రూపాయి ఖరీదుచేసేవందగ్రాముల పంచదారను గ్లూకాన్-డి పేరుతో ఈ 13లకు ఎలా అమ్మగలుగుతున్నాడు? మన బిడ్డలకు బలంవస్తుందని కంపెనీవాళ్లుచెప్పే ఒకేఒక 'అసత్యం' పై ఆధారపడికొంటున్నాం. ఈలోపంఎవరిది? అనుమతించిన (అబద్ధాలు-అర్ధసత్యాలు ప్రచారంచేసుకోవటానికి) ప్రభుత్వానిదా? ఎగబడికొంటున్నాజనందా?

జనం ఆరోగ్యాన్ని దిగజార్చే మరోరెండు పానీయాలున్నాయి. ఒకటి సారాయి, రెండుటానిక్కులు. మొదటిదాన్ని మహిళలు నిషేధించమని పోరాడితే ప్రభుత్వం-కాంట్రాక్టర్లు చాల బాధపడిపోయారు, చివరకు బహిరంగఅమ్మకాలు బందయ్యాయి. త్రాగేవాడులేకుండాచేయడమే గొప్పసంస్కరణ ఉద్యమం.

టానిక్కులు మరింతగా జనంజేబులు ఖాళీచేస్తున్నాయి. ఒకటానిక్కు కొనడానికి సామాన్యుడి ఒకరోజువేతనం కావాలి. తీరాఅది సమకూర్చగల శక్తి చాల తక్కువ. సారాయి కొన్ని గంటల విశ్రాంతికి కావలసిన మత్తునైనా ఇస్తుంది. టానిక్కు ఇది కూడా ఇవ్వదు. మంచిభోజనం స్థానాన్ని ఎన్నిటానిక్కులుతీర్చగలవు. పుష్టికరమైన తిండికి మించిన బలం బజారులో దొరికే ఏవస్తువులోనూ లేదు.

మన ఆహారం, అలవాట్లు, ఆచారవ్యవహారాలలో మనం నిరంతరం మోసానికి గురౌతున్నాము. ఆమోసాన్ని కనిపెట్టాలంటే ప్రజలకు తగినశాస్త్రసాంకేతిక పరిజ్ఞానం కావాలి. అందుకే కావాలి ప్రజల కోసం శాస్త్రవిజ్ఞానం.

## ప్రజాసైన్సు ఉద్యమం

ఉత్పత్తి రంగంలో సైన్సును సృష్టించింది, విస్తరించింది ప్రజలే, అయితే వినియమరంగంలో సైన్సు ఫలితాలు అనుభవించే హక్కు, అవకాశం ప్రజలకు చాలా తక్కువ.

ఆహారధాన్యాల అధికోత్పత్తి ఒకవైపు కష్టజీవుల ఆకలిచావులు మరోవైపు; శాస్త్రసాంకేతికరంగాలవురోగతి ఒక వైపు అజ్ఞానపుకారుచీకట్లుమరోవైపు; విదేశాలకు విజ్ఞానం పంచినదేశంలో ఇంకా నిరక్షరాస్యత-నిరుద్యోగం పెరుదుతున్నాయి. దీనికి కారణం ఏమిటి? అంటూమనదేశంలో శాస్త్రవేత్తలు-సామాన్యులు సమైక్యంగా సాగిస్తున్న ఉద్యమమే ప్రజాసైన్సు ఉద్యమం, దీనిలో అందరూ ఘుఖ్యులే. విద్యార్థులు-ఉపాధ్యాయులు భాగస్వాములై సైన్సును ప్రజల చేతుల్లో ఆయుధంగా మారుద్దాం. రండి. "సమైక్యత-స్వావలంబన కోసం సైన్సుఅక్షరాస్యత" అని నినదిద్దాం.

# మనమూ-మన ఆరోగ్యము

డా॥ వి. బ్రహ్మారెడ్డి

ఆమె ఎలిమెంటరీస్కూలు టీచర్‌: రోజూ రెండువందల మంది పిల్లలు చదువుకుందామని వస్తారు. రిజిష్టరులో మూడువందల పేర్లుంటాయనుకోండి. ఇద్దరు టీచర్లుపోస్టులున్నాయి. టీచరుందిమాత్రము ఆమెఒక్కరే. రోజూ ప్రక్కనున్న టౌన్‌నుంచి వస్తుంది. "టౌన్‌నుంచి ఎందుకువస్తుంది, ఆఊళ్ళోనే ఉండాలికదా ఆమె"? అని నన్నడగవద్దు. ఆప్రశ్నకు జవాబు వైద్యంక్రిందరాదు. రాస్తే ఈపేజీపట్టదుకూడా. ఆరెండొందలు మంది పిల్లల్లో ఐదు తరగతుల వాళ్ళు ఉన్నారు. వీళ్ళకు చదువు చెప్పటం ఈభూమ్మీద ఏటీచరుకూసాధ్యం కాదు. కేవలం గొర్రెల మందను కాచినట్లు, అల్లరిచేయకుండా ఉంచటానికయితే సరిపోతుందేమో ఆమె ఓపికంతా. ఒకరోజు మండల విద్యాధికారి వచ్చి పిల్లలను పరీక్షచేసి, "ఏందిలా ఉంది వీళ్ళచదువు?" అని తిట్టిపోయాడు. అంతంతమంది పిల్లలకు ఒక్కటీచరు చదువుచెప్పటం వీలుకాదని ఆయనకు తెలియదా? తెలుసుగాని, అలాతిట్టాల్సిందే. అదిపద్ధతి మరి బస్సులు సరిగా దొరక్క యింటికి ఆలస్యంగా వస్తే"భర్త"గారి చిందులు. అన్నీకలిసి 'మానసిక వత్తిడి' అనే జబ్బుగాని జబ్బుగా మారింది.

మానసిక వత్తిడి మెదడులో కొన్ని రసాయనాలను తయారు చేస్తుంది. మెదడు నుంచి శరీరానికి శుభ్రంగా నేషనల్ హైవేల్లాగా దారులున్నాయి కాబట్టి, ఆవత్తిడి ప్రభావం శరీరం మీద పడ్తుంది. శరీరంలో గల అన్ని అవయవాలనూ పట్టిచూసి,ఏఅవయవం కాస్త బలహీనంగా ఉంటే దానిమీద ముందు ప్రభావం పడ్తుంది. ఆప్రభావం పొట్టలోని ప్రేవుల మీద పడితే......

## ఇర్రిటబుల్ బవల్ సిండ్రోమ్

'సిండ్రోమ్' అంటే రోగలక్షణాల సముదాయం. "బవల్" అంటే ప్రేవులని అర్ధం. "ఇర్రిటబల్" అంటే ప్రేవులు అవసరానికిమించి కదులు తున్నాయన్నమాట.

కడుపులో మంట వస్తుంది. పుల్లనినీళ్ళు ఊరుతాయి. కాని బేరియం పాడి త్రాగించి ఎక్స్‌రేతీసినా, ఎండోస్కోపు (అంతర్దర్శని) వేసిచూసినా ప్రేగులో పుండుకన్పడదు. కాని అల్సర్ అనేఅనుకొని డాక్టర్లుఎన్ని మందులు వాడినా ఆ "మంట" చల్లారదు. ఈ పరీక్షలన్నీ లేనికాలంలో "పొట్టకోసిచూడు" అనే సూత్రంప్రకారం ఎంతోమంది అభాగ్యులు డాక్టర్ల చేత పొట్టలు కోయించుకున్నారు. అల్సర్ ఉంటేకదా! ఎటూ పొట్ట కోశాంగదాని అపెండిక్స్ తీసేసి డాక్టర్లు చేతులు దులుపుకొన్నారు.

మరికొందరి కయితే పొట్టలో మెలిబెట్టినట్లు నులినొప్పి వస్తుండేది. మార్కెట్లో ఉన్న వైద్య పరీక్షలన్నీ చేయించినా ఒక్కపరీక్షలోనయినా రోగమున్నట్లు బయటపడదు.

ఇంకొందరు కడుపునొప్పి, ఎక్కువసార్లు మలవిసర్జనకావటం, ఉన్నాయంటారు. మలవిసర్జనకు పోయాక కడుపునొప్పి కొంత తగ్గిందంటారు. మలములో జిగురు (బంక, మ్యూకస్) పోతుందంటారు. మలములో రక్తం మాత్రం పడదు. దీన్ని 'అమీబియాసిస్' జబ్బు అని పేరు పెట్టి తృప్తిగా వైద్యం చేస్తారు డాక్టర్లు. వైద్యం, చేసిన నాలుగురోజులు అలా అలా ఉన్నట్లనిపిస్తుంది. మరలా మామూలే. "ఇదేదో పెద్దరోగమొచ్చింది. చివరకేమవుతుందో" అని మానసిక ఆందోళనమరింత పెరుగుతుంది. ఈమలవిసర్జనాలూ, మలంలోజిగురు పడడాలూ మరికాస్తపెరుగుతుంది తప్ప తగ్గవు. మలంలో రక్తం పడకపోతే అది అమీబియాసిస్ కావటానికి వీల్లేదనిమనవి.

**ఏం చేయాలి?**

'ఇదోక రోగమనీ, తగ్గదేమోననీ, తగ్గకపోతే ఎలా అనీ' ఆందోళన చెందటం ముందు మానేయాలి. ఒకటికిబదులు నాలుగుసార్లు మలవిసర్జనకు పోతే వచ్చేనష్టమేమీలేదు. మలంలో జిగురు పడటం జబ్బేమీకాదని నమ్మాలి. మానసిక వత్తిడి తగ్గాక ఈలక్షణాలు వాటంతట అవేతగ్గిపోతాయి. తగ్గకపోయినా కొంపలు మునిగేదేంలేదు.

కడుపులోనొప్పి మరీయిబ్బంది కరంగా ఉన్నా, కడుపులో మంట మరీఎక్కువగా ఉన్నా తాత్కాలికంగా మందులు వాడాల్సిరావచ్చు. మందులతోపాటు కొన్ని జాగ్రత్తలూ అవసరమే. కారం, మసాలాపదార్థాలు తగ్గించాలి. పొగ, సారాయి త్రాగరాదు.

కడుపులో మంట ఎక్కువడా ఉంటే యాంటాసిడ్‌మాత్రలు రోజూ మూడు చొప్పున చప్పరించవచ్చు. యాంటాసిడ్ ద్రావకమయితే రోజూ మూడు/ఆరు మూతలు త్రాగవచ్చు. భోజనంగానీ, టిఫిన్‌గానీ, చేశాక ఈమందు ఉపయోగించాలి. "జెలుసిల్", 'సైలాన్స్‌జిక్‌, 'డైజీన్‌', 'అల్యుడ్రాక్స్' "అల్ట్రాకెయిన్' మొదలగు మార్కెట్ పేర్లలో యాంటాసెడ్ మందులు లభ్యమవుతాయి.

కడుపులో నొప్పి తగ్గటానికి 'విబ్రాక్స్', 'ఈక్విరెక్స్', 'బుస్కొపాన్, లాంటి మందుల్లో ఏదోఒకటి ఉదయంఒకమాత్ర సాయంత్రం ఒకమాత్ర వేసుకోవచ్చు.

మందులు తాత్కాలిక జవాబు లిచ్చేవే. మొత్తంమీద ఆందోళన మనస్తత్వాన్ని అదుపులోఉంచుకోవాలి. అక్షణాలను అంతగా పట్టించుకొనకుండా ఉండాలి. కాలక్రమేణా అదేతగ్గిపోతుంది. ఈపద్ధతి పాటించక పోతే డాక్టర్లకు ఆదాయాలు పెంచుతారు. మీ జేబులు ఖాళీఅవుతాయి. "ఎంతకూతగ్గలేదే" అనిమీ ఆందోళనయింకాస్త పెరుగుతుంది.

**ప్రశ్నలూ - సమాధానాలూ.**

ప్రశ్న: రోజూ 1లీటరు 260 మిల్లీలీటర్లు నీళ్ళు త్రాగితే తలనొప్పి, ఆస్మాతగ్గుతాయని ఈ మధ్య ఎక్కడో చదివాను నిజమేనా?

--మూర్తి. సాతులూరు.

జవాబు:- రోగి పత్యమేంటని అడుగుతాడు. చాలరోగాలకు పత్యమేమీ ఉండదు. అయినా అలాచెప్పడు డాక్టరు. వంకాయ తినవద్దు, గోంగూర తినవద్దు. యిలా ఆయనకు తోచిన పత్యంచెప్తాడు. అప్పుడు రోగికి తృప్తికల్గుతుంది-మందులు పనిచేస్తాయని నమ్మకం కల్గుతుంది. ఇక్కడా అంతే. కచ్చితంగా లీటరుమీద 260 మిల్లీలీటర్లు చెప్పాడంటే యిందులో నిజం ఉండే ఉంటుంది అని జనం నమ్మాలి. ఆయనకోరికా అదే. నీళ్ళు త్రాగటం మంచిదే గానీ, ఇంతనిక్కచ్చిగా కొలతవేసి త్రాగనక్కరలేదు. మంచినీళ్ళు త్రాగటం వలన తగ్గే తలనొప్పి లేదు. ఆస్మా (ఉబ్బసము) కూడా మంచినీళ్ళు త్రాగితే తగ్గేదేమీలేదు. అలాత్రాగితే తలపొప్పి, ఉబ్బసమూ తగ్గుతాయని బలమైనవిశ్వాసం ఉంటే వారికి తగ్గినట్లనిపించవచ్చు. అంతే.

ప్రశ్న:-నేను మాఊరిలో ఆర్.యం.పి.తో చేతికి సూది వేయించుకున్నాను సూది వేసిన రోజునుంచి మణికట్టు దగ్గర చేయిలేవటంలేదు.ఏందిలా అయ్యిందని ఆయన్నడిగితే భుజం దగ్గరసూదివేస్తేభుజం పడిపోవాల చేయెలా పడిపోతుంది? నాకు సంబంధం లేదన్నాడు. చుట్టూ ఉన్నవాళ్ళు కూడా "అవునుకదా?" అన్నారు. నాకర్థంకావటంలేదు. -- మద్ది వేటిస్వామి అలూరు.

జవాబు:- నీకు సూది వేసిన డాక్టరు చాల తెలివిగలవాడు. "ఇక్కడతుపాకీ పేల్చితే మనిషియిక్కడే చావాలిగాని ఫర్లాంగు దూరంలో ఎలా చస్తాడు" అని ఒక తుపాకీరాయుడంటాడు. "నీకొడుకును కిడ్నాపుచేస్తే వాడుఏడవాలిగాని నువ్వెందుకేడుస్తావు' అని ఒకకిడ్నాపుస్పెషలిస్టంటాడు. ఒప్పుకుంటామా"? కొడుక్కూ తండ్రికీ అం కనెక్షనుంటే, భుజానికీ మణికట్టుకూ సంబంధం లేదా? కాలికి పుండయితే చేతికి సూదివేస్తే పనిచేయటం లేదా? కాలికి నొప్పి అయితే నడుముకు ఆపరేషను చేస్తే తగ్గటంలేదా?

మిత్రమా భుజందగ్గరనుంచి మణికట్టును పనిచేయించేనాడివస్తుంది. సరయినచోట సూదివేయకుండా ఆనాడిమీద సూది పొడిచాడు. తన తప్పు కప్పి పుచ్చుకోవటానికి రాజకీయనాయకుడి కంటే తెలివిగా వాదన చేశాడు.

మీరు దీన్ని ఆపరేషనుతో పరిచేసే డాక్టరుకు చూపించండి. ఆనాడిచుట్టూ ఏర్పడిన గట్టి పొరను తొలగించి బాగుచేయటానికి ప్రయత్నం చేస్తాడు.

# భారతీయుల మతసామరస్యము

- కె. శామ్యూల్, కర్నూలు

దేశములో అస్థిరతకు అశాంతికి కారణమైన అనేక కల్లోలాల మాటున వున్నది. మత ప్రభావమే. మత సామరస్యముతో సమైక్యంగా పోరాడి తెచ్చుకున్న స్వతంత్ర భారతాన్ని మత మౌఢ్యంతో రెండుగా విభజించుకున్నాము. మళ్లీ ఈనాడు మత దురభిమానంతో మన దేశాన్ని ముక్కలు చెక్కలు చేసుకునే పరిస్థితికి దిగజారుతున్నా మేమో అనిపిస్తుంది. ఆర్య, ద్రవిడ, గ్రీకు వంటి అనేక సంస్కృతులను తనలో జీర్ణం చేసుకున్నా భరతజాతి, పెక్కు ఉపనదులను,సెలయేళ్లను తనలో కలుపుకుని కదలిపోతున్న గంగాస్రవంతి.

అంత మాత్రాన మతము వల్ల అసలు ముప్పులేదని అనలేము. ఈనాడు పంజాబులో జరుగుతున్న నరమేధానికి, కాశ్మీరం లోని వేర్పాటవాదానికి నేపధ్యం ఒక రకంగా మతమే. కల్హణుని రాజతరంగిణి అందించిన కాశ్మీరసీమ, దేశం కోసం బలి దానం చేసిన భగత్ సింగ్ వంటి త్యాగశీలినిగన్న పంచనదులసీమ, మారణహోమాలతో అట్టుడికి పోవడానికి కారణం మతసామరస్యతోపమే. మతసామరస్యము లోపించుటకు కారణము మతమౌఢ్యము. మతము మాటున మతనాయకుల మోసము మరియు స్వార్ధపరత్వము వున్నాయి.

"మతపు వేషధార్లు మహిమీద పదివేలు
మాఢ జనుల గలరు మూగుచుంద్రు
కొంగలు గుమికూడి కొరకవా? బోదెలు" అన్నారు వేమన

అనగా స్వార్ధపరులు మతం ముసుగులో అజ్ఞానులైన ప్రజలను మోసం చేస్తారని హెచ్చరించాడు.

దేవ శాంతి భద్రతల పరిరక్షణకు, దేశ ప్రగతికి మతసామరస్యాన్ని సాధించుటమే మార్గమని మేధావులు ముక్తకంఠంతో భావిస్తున్న ఈతరుణంలో అసలు మతమంటే ఏమిటి? మత సామరస్యత సాధించుట ఎలా? అనేవి మన ముందున్న సవాళ్లు.

మతమంటే "అభిప్రాయము" అన్నది అసలు అర్ధము. మానవ పరిణామదశలో మేధావుల ఆలోచనా సరళిని ప్రభావితము చేయగల నియమావళి, మతముగా మారినదన్నది మరొక అభిప్రాయము. ఏది ఏమైనా మానవకళ్యాణాన్ని కాంక్షిస్తూ ప్రజల నైతిక వర్తనకు పట్టుకొమ్మగా నిలిచినదే మతము అని పలువురు అభిప్రాయపడుతున్నారు. ఈ అభిప్రాయమునను సరించియే " మతమన్నది జీవన విధానము"ని రాధాకృష్ణ పండితుల వంటి వారు సహితం విశ్వసించారు వేదాలు, ఉపనిషత్తులు "ఆత్మవత్ సర్వభూతాని' 'అంటూ జీవకోటినంతా సమతా దృష్టితో చూడగా, "గీతా"కారుడు సర్వేజనాః సుఖినోభవంతు అంటూ మానవశ్రేయస్సు కోరినాడు. "క్రిస్టియన్ మతం" - "ప్రేమకు అంకితం అంటున్నది". ఇస్లాం మతం " సర్వమానవసమానత్వం మా ఊపిరి" అంటుంది. నేటి ప్రపంచంలో మూడూ పెద్ద మతాలు ముల్లోకాలను ముంచెత్తుతున్నాయి. మతఛాందసులు మానవులను మతం పేరుతో బలిగొంటున్నారు ఈ మతాధికుల మాటలకు చేతలకు భూమికి ఆకాశానికున్నంత దూరం వుంది. జాత్యహంకార క్రైస్తవ మతోన్మాదులు అబ్రహం లింకన్ నూ, హిందూ మతోన్మాదులు మహాత్మాగాంధీని, ఇస్లాం మతోన్మాదులు షేక్ ముజిబుర్ రహమాన్‌నూ కరుడుగట్టిన సిక్కు మతోన్మాదులు శ్రీమతి ఇందిరాగాంధీని, మొదలగుమహనీయులను పొట్టను పెట్టుకున్న వాస్తవం విస్మరించరానిది.

పైన పేర్కొన్న ఈ మతాలలో సామరస్యం గలదా అని చూస్తే ఆర్యమతానికి చెందిన హిట్లరు (జర్మనీ) క్రిస్టియన్ మతానికి చెందిన ముస్సోలిని (ఇటలీ) బౌద్ధమతానికి చెందిన టోజో (జపాన్) ఈ ముగ్గురు మూఢులేగదా రెండవ ప్రపంచయుద్ధాన్ని రెచ్చగొట్టి 4కోట్ల ప్రజల నిండు ప్రాణాలు తీసి, పదికోట్ల ప్రజలను వికలాంగులను చేసి వేలాదికోట్ల ప్రజల ఆస్తిపాస్తులను నాశనము చేసినది.

అయితే మన దక్షిణాదిలోని అన్ని ప్రాంతాలకంటే తెలుగునాట, మత సామరస్యం ఎక్కువ. ఖిలాఫతు ఉద్యమం సందర్భములో మౌలానా షౌకతాలి హిందూ ముస్లిం సమైక్యతా ప్రచారం కోసం తెలుగు దేశానికి వచ్చినప్పుడు ఇక్కడి మత సామరస్యాన్ని చూచి దిగ్భ్రాంతి చెందినాడట. తానిక్కడకు రావలసిన అవసరమే లేదన్నాడట కూడ.

మహతత్వవేత్త వాల్టేర్ "మూఢవిశ్వాసము రక్తపాతాన్ని రెచ్చగొట్టుతుంది. ఇది ఘాతుకాలకు వ్యతిరేకం కాదు. మీదు మిక్కిలి ఘాతుకకృత్యాలను చేయిస్తుంది కూడ." అన్నారు.

మతము మానవ కళ్యాణం కోసమైనా, మతాన్ని ఆసరాగా తీసుకుని కొందరు స్వార్ధపరులు, మూఢచారులు, ఛాందసులు, దానవత్వాన్ని మాత్రమే ప్రకోపింపజేస్తున్నారు. మాయా మత్సరాలకు, దగా, దోపిడి, దౌర్జన్యాలకు, మూల సూత్రములను మూలకు నెట్టినారు. సుమారు ఆరువందల కోట్ల విశ్వమానవకోటిని నాలుగు పెద్ద మతాల నాయకులు మోసద్వేషాలతో ముంచెత్తుతున్నారు.

ఆత్మశుద్ధి లేని ఆచారమదియేల, భాండశుద్ధిలేని పాకమేల
చిత్తశుద్ధిలేని శివపూజలేలదా" అన్నారు వేమన

మనది విశాలదేశము. విభిన్న మతాలకు నిలయమైన మనదేశంలో చెదురు మదురు సంఘటనలు తప్పితే, హిందూ ముస్లిం కక్షలు కావేశాలకు మతాలు మారుపేరుగా తయారయ్యాయి. మతంలోని భేదాలనేవి కనపడకుండా ఐకమత్యంగా అన్ని పండుగలను సంతోషంతో జరుపుకొంటూ జీవిస్తున్న మన మధ్య ఛాందసులు మతోన్మాదులు స్వార్ధ రాజకీయ నాయకులు మతమంటే మూలసూత్రాలు తెలియని అజ్ఞానులు, జీవహింప చేయరాదనే మతానికి జన్మస్థానమైన మనదేశంలో మారణహోమానికి కారణమౌతూ మతసహనమును గురించి ఆలోచించే అవసరాన్ని కల్పించుచున్నారు.

ఈ పరిస్థితులలో ఒకమారు చారిత్రక నేపధ్యాన్ని పరిశీలిస్తే, బౌద్ధమతావలంబులైన మౌర్యులు, హిందూ మతావలంబులైన శాతవాహనులు ఇతర మతాలను కూడా ప్రోత్సమించినారన్న విషయము, పరమతసహనాన్ని ప్రదర్శించుటయేగాక, ఇతర మతాల వారిని వివాహము చేసుకుని, హిందూమతము వారైనా, రాజపుత్రులకు ఉన్నతోద్యోగులను ఇచ్చి, అన్ని మతాల నాయకులతో చర్చలు జరుపుతూ, సర్వ మత సారాన్ని గ్రహించి ప్రజారంజకంగా పాలించిన అక్బర్ చక్రవర్తి రూపొందించిన "దీన్-ఈ-ఇలాహి' ' మతసారము మనము మరువరానిది. ఈ విధంగానే కులమత భేదాలు పాటించక ప్రజలందరినీ సహపంక్తిలో కూర్చోబెట్టి 'చాపకూడు' పెట్టిన బ్రహ్మనాయుడు మనకు ప్రాతఃస్మరణీయుడు. ఏలికలేగాక ఆధ్యాత్మిక విధులలోన శంకరాచార్యుల వంటివారు. "సర్వమతాల సారము ఒక్కటే. అది భగవంతుని చేరుటకు చేసే మార్గము" అంటూ కేవల భక్తి తత్వాన్ని మానవాళికి ప్రబోధించినాడు.

ఈనాడు అన్నిటినీ మరచి మతదురభిమానమునకు లోనైన అజ్ఞానులను ఊహించియే కొబోలు పండిట్ జీ ఇలా అన్నారు. " ఇండియాకు ప్రమాదము ఇది జాగ్రత్తగా గుర్తుంచు కోంది - కమ్యూనిజం కాదు - అది హిందూ అభివృద్ధి నిరోధక కమ్యూనలిజం'.

మనకు స్వేచ్ఛను ప్రసాదిస్తానని బయలు దేరిన మతం, స్వేచ్ఛకు బద్ధశత్రువుగా తయారైంది. మత కట్టుబాట్లను బద్దలు కొట్టడం అన్నింటికన్నా పెద్ద పని.

"మత ముసుగులో మోసము మానవున్ని ఆవరించినపుడు ఆ అంధుడు ఇతరులను చంపుతాడు. లేదా తన్ను తానే చంపుకుంటాడు. నాస్తికుడైనాసరే? ప్రభువు ఆశీస్సులు అందుకుంటారు. కారణం? ఇతడు వాస్తవిక మతాన్ని మరుగు పరిచేనటన చేయడు". అంటారు రవీంద్రుడు.

ఆత్రోవలో అజ్ఞానాన్ని వదిలించే విద్యకు నిలయమైన విద్యాలయాలు మత సామరస్యతను పెంపొందించే కోవెలలు అయిననాడు భావి భారతానికి బంగారు భవిష్యత్తు వుంటుంది. రాజకీయ నాయకులు, మానవ కళ్యాణం కోసం రూపొందించిన మతాలను తమ రాజకీయ ప్రయోజనాలకు వాడుకొనని విధంగా మసలు కోవాలి. అప్పుడు మతసామరస్యము భారతీయులకు ఒక సమస్య కానేరదు.

ఈ సందర్భంగా మహాకవి గురజాడ సందేశము మనం మననంచేసుకుందాం.

"చెట్ట పట్టాల్ పట్టుకుని దేశస్థులంతా నడువవలెనోయ్ అన్నదమ్ములవలెను

జాతులు మతములన్నీ మెలగవలెనోయ్"

# ఆధునిక విద్యారంగం - సవాళ్ళు

వి. బాల సుబ్రహ్మణ్యం

ఒక సమాజ పురోగమన సూచికగా, అభివృద్ధికి గీటు రాయిగా ఈ రోజు మానవ అభివృద్ధిని (Human Development) కూడా పరిగణనలోనికి తీసుకొంటున్నారు. సగటు ఆయుః ప్రమాణం, పిల్లల మరణాల రేటు, తల్లుల మరణాల రేటు, సగటు సంతానం ఇవన్నీ కూడా మానవాభివృద్ధికి సూచికలే. అయినా ఇవన్నీ కూడ విద్య మీద ఆధారపడి వున్నందువల్ల అక్షరాస్యతా శాతం, విద్యా ప్రమాణాలు ఆయా సమాజాల అభివృద్ధికి సూచికలుగా లెక్కిస్తున్నారు.

ఊరకే లెక్కించడమే గాదు అక్షరాస్యతను బట్టి అప్పులిస్తామనే దాకా ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధులు వచ్చాయి.

దీంతో పాటు 'తలుపు తెరిచిన ఆర్థిక విధానాలు' వచ్చేశాయి. వ్యాపారం ప్రపంచీకరణ చెందుతుంది. వర్ధమాన దేశాల మార్కెట్టు మీద, వనరుల మీద చివరకు కొండల్లో కోనల్లో ఉండే అడవి జాతి గడ్డి మొక్కల మీద కూడా సంపన్న దేశాల కన్ను పడింది. ఎగుమతులకు ప్రాధాన్యమిచ్చే విధంగా పరిశ్రమలు నెలకొల్పు తున్నారు. విదేశీ వస్తువులకు వినియోగదార్లుగా వర్ధమాన దేశాల సంపన్నులూ, మధ్య తరగతి వారూ మారుతున్నారు. చవకగా, తమ దేశాలకు పర్యావరణ సమస్యలు లేకుండా, ఇక్కడి వనరులు ఇక్కడే వినియోగించి, ఇక్కడ తక్కువ కూలీ శ్రామికుల చేత వస్తూత్పత్తి చేయించి ఇక్కడే అమ్మి లాభాలు తరలించుకొని వెళ్ళే వ్యూహంలో సంపన్న దేశాలున్నాయి. ఇదంతా మన మేలుకే అని చంకలు గుద్దుకొనే దశలో మనం వున్నాం.

సరిగ్గా ఇలా చంకలు గుద్దుకోవడమే సంపన్న దేశాలకు కావాలి. వేలం వెర్రిగా ఈ విధానాల్ని ఒక మోజులోపడి జనం అంగీకరించాలి. విదేశీ వస్తువుల పైకి జనం ఎగబడాలి. ఐ.యం.యఫ్, వరల్డు బ్యాంకూ మన పిల్లలకి మమ్మీ డాడీలుగా కన్పించాలి. నైపుణ్యం గల కార్మికులు క్యూలో నిలబడాలి. గ్రామీణ ఫ్యూడల్ సంబంధాలు ఎంతో కొంత మేరకు తెగిపోవాలి.

దీని కోసం జనానికి అక్షర జ్ఞాన కావాలి. ఇదే రహస్యం.

'ఒకందుకు పోలిస్తే మరొకందు తాగా'మని సామెత. అలాగే ఎవరి ఉద్దేశం ఏదైతే నేం? మన జనానికి చదువు వస్తే మనకు మంచిదే. దీన్ని ఎవ్వరూ కాదనలేరు. దీంతో 'అందరికీ చదువు' అని ఇటీవల బడుగు దేశాలంతా కూచొని చర్చించాయి. 'సంపూర్ణ అక్షరాస్యతా ఉద్యమాలు' చేపడుతున్నాయి. దీనికి ధారాళంగా అప్పులు తెచ్చు కొంటున్నాయి.

ఈ నేపథ్యంలో మనం మరో విషయం గుర్తించాలి. ఆధునిక సమాజం అక్షరాస్యతావశ్యకతను ప్రజలకు తెలియజెపుతుంది. ప్రజల్లో చదువు పట్ల, ముఖ్యంగా తమ పిల్లల చదువు పట్ల శ్రద్ధాసక్తులు పెరుగుతున్నాయి.

ఈరోజు గ్రామీణ ప్రజలు రేషన్ కార్డుల తర్వాత బడి గురించీ, చదువుల గురించీ అడుగుతున్నారు. తమ పిల్లలకు నాలుగు ముక్కలు చెప్పండని నిలదీస్తున్నారు. లాభంలేదనుకొంటే 'ప్రైవేటుదారులు వెతుక్కొంటున్నారు. ఒక లెక్క ప్రకారం ఈ రోజు 95% పిల్లలు వారికి వారే పాఠశాలల్లో చేరుతున్నారు. వాళ్ళ తల్లిదండ్రుల్లో ఆ చైతన్యం వస్తోంది. చదువు వ్యక్తిగతంగానే గాదు ఒక సామాజికావసరంగా మారుతోంది. ఇదెంతో శుభసూచకం.

మహిళల్లో వస్తున్న చైతన్యం కూడా దీనికి తోడవుతోంది. ప్రస్తుతం సాగుతున్న సాక్షరతా ఉద్యమంలోని ఒక సార్వత్రిక అనుభవం ఏమంటే అన్ని రాష్ట్రాల్లోనూ ఇందులో మహిళలే ముందుండటం. వీరిలోనూ అట్టడుగు వర్గాల మహిళలే ముందుడడం మరింత శుభ సూచకం.

ఈ అన్నింటి నేపథ్యంలో విద్యారంగం నానాటికి ప్రాధాన్యత సంతరించుకొంటుంది. ఆధునిక పారిశ్రామిక ప్రపంచంలో పెరుగుతున్న పోటీ స్పష్టంగా విద్యా రంగంలోనూ ప్రతిబింబిస్తోంది. మంచి విద్య కావాలని తల్లిదండ్రులెంతయినా సొమ్ము వెచ్చిస్తున్నారు. ఎన్నైనా కొనిపెడుతున్నారు. ఎక్కడికైనా పంపుతున్నారు. విద్యారంగంపై ఈ కొత్త పరిస్థితుల ప్రభావం కూడా తీవ్రంగా ఉంది.

ఈ నేపథ్యంలో మన విద్యారంగంపై అనేక చర్చలు జరుగుతున్నాయి. ప్రశ్నలు వెలువడుతున్నాయి. పరిశోధనలు జరుగుతున్నాయి. పథకాలు ప్రారంభమవుతున్నాయి. పలు కోణాల నుంచి పరిశీలన సాగుతోంది.

అసలు బడిలో ఎంత శాతం పిల్లలు చేరుతున్నారు ? వారిలో ఎందరు పారిపోకుండా మిగులుతున్నారు ? మిగిలిన వారికి వచ్చిన చదువెంత? ఆచదువుకు సార్థకత ఎంత ?

ఈ వైఫల్యాలకు టీచర్లు కారకులా ? బోధనా విధానం కారణమా? సిలబసు కారణమా ? పరీక్షలు కారణమా ? విద్య పట్ల మన దృక్పథంలోనే ఏదైనా లోపం వుందా?

ఈ పరిస్థితులకు టీచర్లతో పాటు, తల్లిదండ్రు లెంత వరకు కారకులు? ప్రభుత్వం ఎంత మేరకు బాధ్యులు ?

యాజమాన్య వ్యవస్థ పద్ధతుల్లో ఏలోపాలున్నాయి ? ముఖ్యంగా ప్రజలకు జవాబు దారీతనం, ప్రజల భాగస్వామ్యం విద్యారంగంలో ఎందుకు కొరవడింది ?

ప్రైవేటైజేషన్ దీనికి పరిష్కారమా ? ప్రభుత్వరంగంలో చదువులు అవసరం లేదా ? మరి నిధుల మాటేమిటి ? విదేశాల సాయం ఎంత మేరకు తీసుకోవచ్చు ? అవి ఏ షరతులతో వస్తాయి ? ఎక్కడికి దారి తీస్తాయి ?

ఇవన్నీ సవా లక్ష ప్రశ్నలు.

ఈ ప్రశ్నలకు జవాబులు తామే వెతుక్కొంటున్న వాళ్లు ఉన్నారు. కొన్ని ప్రయోగాలతో పరిష్కారాలు చూపుతున్నవారూ ఉన్నారు. వీటిని వరుసగా పరిశీలిద్దాం.

(ఇంకా వుంది)

# శ్రీ హేలాపురి రెసిడెన్షియల్ కాలేజి

ఆది నుండి ఉభయగోదావరి, కృష్ణా జిల్లాలలోని విద్యార్థులకు చిరపరిచితులై వైద్య, ఇంజనీరింగ్ ప్రవేశపరీక్షలకు శిక్షణ యిచ్చి అనేకమందిని వైద్య, ఇంజనీరింగ్ విద్యార్థులుగా తీర్చిదిద్దిన అధ్యాపకుల సారథ్యంలో వెలసిన వినూత్న విద్యాసంస్థ.

*ఈ సంస్థ పురోగమనంలో నాల్గవ సంవత్సరంలోకి ప్రవేశించే ఈ తరుణంలో. . . . . . .*

విద్యార్థినుల కొరకు మహిళా విభాగమైన

## శ్రీ హేలాపురి రెసిడెన్షియల్ మహిళా కళాశాల

రెండవ సంవత్సరంలోకి ప్రవేశించింది.

ఇది ఉభయ గోదావరి జిల్లాలలో ప్రప్రథమంగా ఆవిర్భవించిన రెసిడెన్షియల్ మహిళా కళాశాల.

## మా విజయాలు

**1992 సంIIలో 40 ఇంజనీరింగ్, 3మెడికల్, 1 అగ్రికల్చరల్,**

**1993 సంIIలో ఇంటర్‌లో 13వ ర్యాంకు,**

**EAMCET లో 39వ ర్యాంకు,**

**IIT కాన్పూరులో సీటు సాధించిన మా విద్యార్థి జి. శ్రీరామ్‌తో పాటు**

**54 ఇంజనీరింగ్, 2 మెడికల్, 2 అగ్రికల్చరల్**

☆ **SSC లో 500 మార్కులు దాటిన విద్యార్థులకు ట్యూషన్ ఫీజులో 25% రాయితీ.**

☆ **స్టేటు ర్యాంకులు, జిల్లార్యాంకులు సాధించిన విద్యార్థులకు ఉచిత విద్యాసౌకర్యం.**

☆ **స్కూలు ఫస్టు వచ్చిన విద్యార్థికి ట్యూషన్ ఫీజులో 25% రాయితీ**

**పైరాయితీలతో బాటు ఇంటర్ Text పుస్తకములు ఉచితం**

# పిల్లల బంగారు భవితవ్యానికి

శ్రీ హేలాపురి రెసిడెన్సియల్ కాలేజి

శ్రీ హేలాపురి రెసిడెన్షియల్ మహిళాకళాశాల

శ్రీ హేలాపురి రెసిడెన్షియల్ హైస్కూల్

శాంతినగర్, ఏలూరు. ఫోన్ 23047

ప్రిన్సిపాల్: కె.వి. సుబ్బారావు ఎమ్.ఎ.,

# ఆర్థిక రంగం

## వ్యవసాయరంగానికి అగ్గితెగులు గాట్

(గత మార్చి సంచిక తరువాయి)

- యస్. ఆనంద నాయుడు

వ్యవసాయ రంగం దేశ జనాభాలో ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాల్లో ౧74 శాతం మందికి ఉపాధి కల్పిస్తున్నది. దేశ ప్రజలందరికి ఆహారం సమకూరుస్తున్నది. పరిశ్రమలకు కావలసిన ముడిసరుకును సరఫరా చేస్తున్నది. ఇంతటి ప్రాధాన్యత గల వ్యవసాయ రంగం నానాటికి నిర్లక్ష్యం చేయబడుతూనే ఉన్నది. 1994-95 బడ్జెట్ అందుకు ఉదాహరణ. రూ॥ 1,51,699లు కోట్లుగా ఉన్న బడ్జెట్ మొత్తంలో, వ్యవసాయ రంగానికి కేటాయించింది కేవలం 1.32 శాతం. అనగా రూ॥ 2005లు కోట్లు. నికర జాతీయోత్పత్తిలో వ్యవసాయం వాటా 1980-81లో 36.3 శాతం 1990-91 నాటికి 31.3 శాతానికి తగ్గింది.

దేశంలో సేద్యానికి అనువైన భూమిలో 22 శాతం నిరుపయోగంగానే వుంది. నీటిపారుదల, గ్రామీణ అభివృద్ధి మొదలైన వాటికి కేటాయించిన డబ్బులు కూడ ఖర్చు కావడం లేదు. నీటిపారుదల రంగంలో పెట్టుబడి తగ్గి నీటిపారుదల వినియోగ సామర్థ్యం తగ్గిపోతున్నది. ఫలితంగా ఉత్పత్తిలో అభివృద్ధి కుంటుపడుతున్నది.

భూసంస్కరణ నినాదంగానే మిగిలిపోయింది. మిగులు భూమి పంపిణీ ఆగిపోయింది. అతి, తక్కువ మంది చేతిలో ఎక్కువ భూమి కేంద్రీకరింపబడింది. సన్నకారు చిన్నకారు రైతులకు వారి శ్రమ కూడ దక్కని పరిస్థితుల్లో వ్యవసాయ రంగంలోని సంక్షోభం కొనసాగుతున్నది.

**గోరుచుట్టుపై రోకటిపోటు గాట్ :**

ఈ నేపథ్యంలో భారత వ్యవసాయ రంగం పస్తులు, పత్యాలతో బతుకుతున్నది. గాట్ ఒప్పందం కుదిరిన దరిమెలా వ్యవసాయ రంగం సజీవ సమాధికి సమాయత్తం చేయడం జరిగింది. డంకెల్ ప్రతిపాదనలలో ఎక్కువగా ప్రభావితమయ్యే రంగం వ్యవసాయం. అందుకే గత కొంత కాలంగా గాట్ ఒప్పందం వల్ల వ్యవసాయ రంగంలో జరిగే లాభనష్టాలపై దేశంలో వాదోపవాదాలు ఎక్కువైనాయి. ఒప్పందంపై సంతకం చేసిన ప్రభుత్వం తన చర్యను సమర్థించుకొనే రీతిలో "అశ్వత్థామోహత: - కుంజరః" అనే పద్ధతిలో మేళ్ళను గూర్చి గట్టిగా చెప్పి, కీళ్ళను గూర్చి వినపడీ వినపడకుండా చెబుతున్నది. చేసిన పనిని సమర్థించుకునే పద్ధతిలో ప్రభుత్వ వాదనలో పసలేదనేది ఇటీవల సామాన్య జనం ఆందోళనలను పరిశీలిస్తే తెలుతున్న సత్యం. వీధి పోరాటాలకు కూడ ప్రజలు సిద్ధపడుతున్నారంటే డంకెల్ పై ప్రజలకున్న భయాందోళనలు అంతటి వన్న మాట!

**వ్యవసాయ రంగంలో సబ్సిడీలు తగ్గింపు :**

ఎరువులు, విద్యుచ్ఛక్తి, నీటిపారుదల సబ్సిడీలను తగ్గించడం జరుగుతున్నది. గత రెండు బడ్జెట్‌లలో కలిపి దాదాపు రూ॥ 5 వేల కోట్ల ఎరువుల సబ్సిడీలు కోత పెట్టినారు. రాష్ట్ర ప్రభుత్వం విద్యుచ్ఛక్తిలో రైతులకిస్తున్న రాయితీని కూడ తీసివేయాలని కేంద్రప్రభుత్వం ఆశిస్తున్నది. విద్యుదుత్పత్తి ప్రయివేటు పరమవుతున్నది. కనుక ఈ రాయితీ త్వరలో తొలగవచ్చు.

ప్రపంచ దేశాలతో పోల్చినపుడు వ్యవసాయానికిస్తున్న రాయితీలు మనదేశంలో చాలా స్వల్పం. మొత్తం ఉత్పత్తిలో 6శాతం మాత్రమే మన సబ్సిడీలున్నాయి. జపాన్ 62 శాతం, అమెరికా 35 శాతం, యూరపు 40 శాతం వరకు సబ్సిడీ లిస్తున్నారు. వారు ఎంత తగ్గించినా మనతో సమానం కారు. పైగా మన సబ్సిడీలు 3 శాతానికి తగ్గించాలనే ఒత్తిడి కూడ జరుగుతున్నది.

సబ్సిడీలు తగ్గింపు వల ఉత్పత్తి పై ప్రభావం విపరీతంగా వుంటుంది. 35శాతం సబ్సిడీలు తీసికొంటున్న అమెరికా రైతు హెక్టారుకు 24.5 క్వింటాళ్ళు ధాన్యం పండిస్తున్నాడు. మన దేశ రైతు ఈ మాత్రం సబ్సిడీలుండగా 5.5 క్వింటాళ్ళు పండిస్తున్నారు. సబ్సిడీలు తగ్గించడం వల్ల ఎరువుల, మందుల వినిమయం తగ్గి ఉత్పత్తిలో తరుగుదల వస్తుంది. మనం 8వ పంచవర్ష ప్రణాళికలో 21 కోట్లు టన్నుల ఆహార ధాన్యాలను ఉత్పత్తి చేయాలని నిర్దేశించుకున్నాం. అయినా 18కోట్ల టన్నులకు మించలేదు. కనుక సబ్సిడీలు తొలగింపు వ్యవసాయ రంగాన్ని దెబ్బ తీస్తుంది.

**దిగుమతులపై అవరోధాలు తొలగించడం**

గాట్ ఒప్పందం ప్రకారం మన దేశ మార్కెట్టులో 3.3 శాతం భాగాన్ని విదేశాలకు అనుమతి యివ్వాలి. దిగుమతులు ఇప్పటికే హెచ్చు స్థాయిలో ఉండగా ఈ సూచనను అమలు చేస్తే మన వ్యవసాయ వాణిజ్యరంగంలో విదేశీ దిగుమతులు ప్రాబల్యం వహిస్తాయి. ఆ ప్రకారం అవసరమైనవి, అవసరం లేనివి దిగుమతులు పెరుగుతాయి. ఇప్పటికే దిగుమతులు పెరిగి విదేశీ వాణిజ్యం చెల్లింపులు లోటు సమస్యగా మిగిలింది.

ఆహార ధాన్యాలు, చక్కెర, పత్తి వంటివి దిగుమతులు చేసికోవడం అంటే మన నెత్తి మీద మనమే చెత్తవేసికోవడమన్న మాట. సబ్సిడీలు తగ్గి మన ఉత్పత్తి తగ్గుతుంది. తగ్గిన ఉత్పత్తిని భర్తీ చేసి కోవడం కోసం విదేశాల నుండి దిగుమతి చేసి కోవాలట! ఈ తిరకాసులో వున్న అంతరార్థమేమిటి ? అభివృద్ధి చెందిన దేశాలలోని వ్యవసాయ ఉత్పత్తులను మనలాంటి దేశాలకు అమ్ముకొని లాభాలు గడించుకోవడం ఇందులో ప్రధానం. మనపైన, మన రైతు పైన నిజంగా ప్రేమ వుంటే ఉత్పత్తిని పెంచే విధంగా మరిన్ని ప్రోత్సాహకాలు అందచేయాలి. అవేవీ ఇవ్వకపోఎగా ఉన్న పోత్సాహకాలు కూడ రద్దు చేస్తే జరిగేది - పరాధీనమే. తగిన ప్రోత్సాహకాలిస్తే ఆహార ధాన్యాలు, చక్కెర, నూనె గింజలు, పత్తి లాంటి వాటిలో మిగులు ఉత్పత్తిని సాధించే విధంగా మన రైతు శ్రమ చేయగల సామర్థ్యం ఉంది. ఇప్పటికే మన ఎగుమతులలో వ్యవసాయం వాటా దాదాపు 14 శాతం పైగా వుంది. దీన్ని పెంచుకోవచ్చు.

కాని గాట్ ఒప్పందం అమలు చేస్తే వ్యవసాయ రంగంలో కూడ స్వావలంబన సాధబంచలేము. మన గ్రామీణ రైతును, మట్టినే నమ్ముకొన్న ఆ శ్రమ జీవిని శాశ్వతంగా విదేశీయులకు బానిసగా నిలబెట్టడమే జరుగుతుంది. అంత మాత్రమే కాదు. వ్యవసాయ రంగంలో ప్రత్యక్ష పాత్ర వహిస్తున్న 74 శాతం భారతీయులు మరింత దారిద్ర్యంలో మగ్గడానికి దోహదం చేస్తుంది.

### మార్కెట్టుకు సంపూర్ణ స్వేచ్ఛ :

పండించిన పంటను ఎక్కడైనా అమ్ముకోవడానికి వీలుగా సంపూర్ణ స్వేచ్ఛ ఉండాలనేది మరొక అంశం.అ నగా ఆంధ్రలో రైతు పండించిన ధాన్యం ప్రభుత్వ అనుమతితో నిమిత్తం లేకుండా మధ్యప్రదేశ్‌లో అమ్ముకోవడానికి స్వేచ్ఛ కల్పించడమన్నమాట. దీని వల్ల రైతుకు రేటు పెరుగుతుందని, కనుక రైతుకు ఇది ప్రయోజనకరమైనదని కొందరి వాదన. దీనిని వెంటనే అమలులోనికి తేవాలని ఇటీవల డిమాండు

పెరిగింది. ఆంధ్ర ప్రభుత్వం దానిని వ్యతిరేకించడం వల్ల ఇంకా అమలు కాలేదు.

స్వేచ్ఛా మార్కెట్లు వల్ల రైతు లాభపడతాడనేది ఒక మోసం. ఇప్పటికీ రైతు చేతికి పంటవచ్చినపుడు ధరలు తగ్గుతాయి. వ్యాపారస్తుల చేతికి పోయిన ఆ పంట వినిమయ దారుకు చేరే సరికి ధరలు పెరుగుతాయి. వ్యాపారస్తుల లాభాల కోసం జరిగే ఈ నాటకంలో ఎప్పటికీ సామాన్య మధ్యతరగతి రైతులు నష్టపోతూనే వున్నారు. స్వేచ్ఛా మార్కెట్లును అమలు చేయడం వల్ల రైతుకు వచ్చే అదనపు ప్రయోజనం ఏమీ వుండదు.

**అగ్గి రోగం లాంటిది పేటెంటు :**

గాట్ ఒప్పందంలో అత్యంత వివాదాస్పదమైనది. పేటెంటు చట్టంలో మార్పులు వివాదాస్పదమైనవే కాదు, వర్ధమాన దేశాలకు అత్యంత ప్రమాదకారి కూడ. గాట్ ఒప్పందం ప్రకారం భారతదేశంలో 1970 నుండి వున్న పేటెంటు చట్టాన్ని మార్చవలసి వుంది. అనగా గాట్ ప్రకారం ప్రాసెస్ పేటెంటును మార్చుకోవాలి. ప్రాసెస్ పేటెంటు వల్ల ఒకే వస్తువును భిన్నమయిన ప్రాసెస్‌లో ఉత్పత్తి చేయవచ్చు. ఈ పద్ధతి వల్ల వరి వంగడాల్లో అనేక రకాలు అభివృద్ధి చేసికోవడం జరిగింది. నేడు ప్రాసెస్ పేటెంటును రద్దు చేసి ప్రాడక్టు పేటెంటును అనుమతించడం ద్వారా ఇంతవరకు భారత శాస్త్రజ్ఞులు సాధించిన ఫలితాలను ఏ ఒక్క వ్యక్తికో, సంస్థకో ధారాదత్తం చేయడమన్నమాట.

గాట్ ఒప్పందం ప్రకారం ప్రకృతిలో లహభించే మొక్కలు తదితర జీవరాశులను - పేటెంటు చట్టం పరిధిలోనికి తీసికొని రావాలి. అంతే కాదు. ప్రపంచ జన్యు వనరులను మానవ జాతికి సహజ వారసత్వంగా సంక్రమించిన "సమిష్టి" సంపదగా గుర్తించాలి. ఈ రెండు అంశాలు వర్ధమాన దేశాల వ్యవసాయ రంగాన్ని సమూలంగా దెబ్బతీసే ప్రతిపాదనలు.

ఇప్పటి వరకు మనదేశంలో భారత శాస్త్రజ్ఞులు జీవ సాంకేతిక రంగంలో విశేష కృషి చేసినారు. మంచి రకాలైన వంగడాలను రైతుల కందించినారు. ప్రస్తుతం గాట్ ప్రకారం ఈ వంగడాలను ఎవరైన తీసికొని కొద్దిపాటి మార్పు చేస్తే అది పూర్తిగా వారి హక్కు అవుతుంది. ఇక మరెవరూ ఆ వంగడాన్ని గాని, విత్తనాలను గాని వారి అనుమతి లేనిదే వాడుకోరాదు. తగిన రాయల్టీ చెల్లిస్తే తప్ప అనుమతి రాదు. రైతులు ఒకసారి తీసికొన్నా పునరుత్పత్తికి ఉపయోగించుకోరాదు. అనగా రైతు తన పొలంలో పండిన పంటను తిరిగి పంటకోసం విత్తనంగా ఉపయోగించరాదు. డంకెల్ ముసాయిదా 14 (1) ఆర్టికల్ ప్రకారం ఇది వర్తిస్తుంది. ప్రతి పంటకు రైతు విత్తనాలను హక్కుదారు సంస్థ నుండి కొనుగోలు చేయాలి.

పేటెంటు వల్ల భారత రైతుకు ఒనగూరే ప్రయోజనం ఇదన్న. మాట! సాంప్రదాయకంగా తన పంట నుండి విత్తనాలను ఎంచుకునే పద్ధతికి రైతు స్వస్తి పలకాలి. స్వచ్ఛందంగా స్వస్తి చెప్పక పోయినా పలికే విధానాలను గుత్త సంస్థలు అవలంభిస్తాయి. విత్తనాలలో పునరుత్పత్తి శక్తిని తగ్గించడం ద్వారా విత్తనాలుగా వాడుకోవడానికి పనికి రాకుండా చేస్తాయి. ఫలితంగా ప్రతి పంటకు రైతు గుత్త సంస్థ నుండి విత్తనాలను కొనుగోలు చేయవలసి వస్తుంది. దేశ వెన్నెముక అయిన రైతు వెన్నెముక విరిగితే ఒక "దేశం" ఎలా నిలబడుతుందో ఆలోచించాలి.

వృక్ష జన్యు సంపదను ప్రపంచ సమిష్టి సంపదగా భావించడం వెనుక ఒక పెద్ద కుట్ర వుంది. వృక్ష జన్యు సంపదలో అత్యధిక భాగం వర్ధమాన దేశాలలోనే లభ్యమవుతున్నది. మరే ప్రాంతంలోను లభ్యం కాని జన్యువైవిధ్యం గల విలువైన వృక్ష సంపద ఈ మూడో ప్రపంచ దేశాలలోనే వుంది.

గాట్ ప్రకారం ఆయా దేశాలలోని వృక్ష సంపదపై ఆయా దేశాలకు గల హక్కును నిరాకరించడం జరుగుతుంది. పైగా ఈ వనరులను ప్రయివేటు పరం చేసే ప్రక్రియ కూడ ప్రారంభమయింది. ఉదాహరణగా భారతదేశంలోని వేపచెట్టును మన శాస్త్రజ్ఞులు పేర్కొంటున్నారు. వేప నుండి వచ్చే రసాయనం కీటక నాశక గునాలపై ఒక సంస్థ పరిశోధనలు జరుపుతున్నది. అది విజయవంతమైతే వేప పైన సంపూర్ణ పేటెంటు హక్కు వారికి లభిస్తుంది. మరెవరు గాని, ఏవిధంగా గాని దాన్ని ఉపయోగించు కోవడం శిక్షార్హమవుతుంది. సాంప్రదాయకంగా మనం ఔషధ విలువలు గల వృక్షంగా విలువనిస్తున్న వేప శాశ్వతంగా మన వినియోగానికి దూరం కాబోతున్నదని శాస్త్రజ్ఞులు పేర్కొంటున్నారు. ఔషధ పరిశ్రమకు వినియోగించే వివిధ రకాల మన వృక్ష సంపద మాటేమిటి ?

జన్యువులు తదితర జీవరాసులపై పేటెంటు హక్కులను కల్పించడం వలన మన దేశ పరిశోధనా రంగం ఇబ్బందులను ఎదుర్కొంటుంది. పరిశోధనా రంగానికి కావలసిన జన్యువులు, మొక్కలు ఉచితంగా లభ్యం కావు. ఎంతో మూల్యం చెల్లించి మన మొక్కల్ని మనమే కొనుగోలు చేయవలసి వుంటుంది. ఆయా సంస్థల దయాదాక్షిణ్యాలపై ఆధారపడి మాత్రమే మన పరిశోధనా రంగం పని చేయవలసి వుంటుంది. విత్తనోత్పత్తి కొన్ని బహుళ జాతి సంస్థల నియంత్రణ కిందికి వస్తుంది. అత్యంత ప్రధానమైన ఆహారం, వైద్యం వంటివి కొన్ని గుత్త కంపెనీల చెప్పు చేతలకు లోబడి వుండవలసి వస్తుంది.

చిన్న విత్తనాల కంపెనీలు, విత్తనాల పరిశోధనా సంస్థలు దెబ్బ తింటాయి. భారత పరిశోధనా వ్యవసాయ మండలి సమన్వయ పరుస్తున్న పరిశోధనా రంగంలో 6500 మంది శాస్త్రజ్ఞులు, 8000 మంది సాంకేతిక నిపుణులు పనిచేస్తున్నారు. వివిధరాష్ట్రాల్లో వ్యవసాయ విశ్వ విద్యాలయాల్లో 25,000 మంది శాస్త్రవేత్తలున్నారు. వీరందరి కృసి ఫలితంగా దాదాపు 1,937 మేలు జాతి వంగడాలు రూపొందినాయి. ఇప్పుడు జరగబోయేది ఈ వంగడాలను తీసికొని కొద్దిపాటి మార్పు చేసి బహుళ జాతి సంస్థలు తమ గుత్త సొత్తుగా స్వంతం చేసి కోవడమే. శాస్త్రవేత్తలకు ఇప్పటికే ప్రోత్సాహం కరవై నిస్పృహలో నున్నారు. మన భారత పరిశోధనా రంగం మొత్తంగా క్షీణదశకు చేరుకొనే పరిస్థితిని గాట్ కల్పించనున్నది. ఇది మన దేశ ఆర్థిక స్వతంత్రను, స్వావలంబనను దెబ్బ తీస్తుంది.

దీనివల్ల దీర్ఘకాలంలో రైతులు ప్రతిసారి అత్యధిక ధరలలో విత్తనాన్ని, ఎరువులను, క్రిమి సంహారకాలను కొనుగోలు చేయలేక చతికిల పడతారు. ఫలితంగా అప్పుల పాలై తమ వ్యవసాయ భూములను కోల్పోయి వ్యవసాయ కార్మికులుగా మారడం జరుగుతుంది.

డంకెల్ ప్రతిపాదనలు చాప క్రింద నీరులా ప్రవేశించి అగ్గి తెగులుగా వ్యాపించి వ్యవసాయ రంగాన్ని సమూలంగా కాల్చి వేస్తుందనడంలో అతిశయోక్తి లేదు.

గాట్ వల్ల పెద్ద పెద్ద భూస్వాములకు ప్రయోజనం కలగవచ్చు. పండ్ల తోటలు, ఆక్వాకల్చర్ లాంటి వాణిజ్య ఉత్పత్తులు ఎగుమతులు ఎక్కువుతాయనే వాదన సమర్థనీయం కాదు. వ్యవసాయ రంగం వాణిజ్య పంటలపై మొగ్గు చూపితే ఆహారోత్పత్తులు కుంటుపడతాయి. ఆహార ధాన్యాలకు విదేశీ దిగుమతులపై ఆధారపడడం శ్రేయస్కరం కాదు. ఏకొద్ది పాటి ఎగుమతులను ఆశించి గాట్‌ను సమర్థించడమంటే "మబ్బును చూసి ముంత ఒలక బోసికొన్నట్లు" అవుతుంది.

(ఇంకా వుంది)

# SRI KRISHNAVENI EDUCATIONAL ACADEMY

VIJAYAWADA

## Sri Krishnaveni Engineer's College

Patamatalanka, Vijayawada-14, Phone: 477745, 477945

## Sri Krishnaveni Residential Junior College

K.C.P. colony, Vijayawada-7 Phone: 58449

## Sri Krishnaveni Residential Talent School

Poranki, Vijayawada, Phone: 58313

## Sri Krishnaveni Science (Junior) College

Patamatalanaka, Bandar Road.
Vijayawada-14, Phone: 477745, 477945

## Sri Krishnaveni Talent School & Public School

Patamatalanka, Vijayawada-14, Phone: 477745, 477945





# నియమ నిబంధనలు

## అదనపు ఇంక్రిమెంట్లపై అవగాహన

- ఆర్. శ్రీహరిరావు.

ఉపాధ్యాయ ఉద్యమాలపోరాట ఫలితంగా ఈ మధ్యకాలంలో సాధించుకున్న ప్రధానాంశాలలో 82.86 రీగ్రూపింగ్‌కాలము మరియు '86 వేతనములలో అదనపు అర్హతల ఇంక్రిమెంట్లు ముఖ్యమైనవి. అయితే ఈ నిబంధనలకు జారీచేయబడిన ప్రభుత్వ ఉత్తర్వులలోని లోపాలు, వాడిన పదజాలము పట్ల సరియైన అవగాహనా లోపం వగైరాల కారణంగా అదనపు అర్హతల ఇంక్రిమెంట్లు మంజూరులో ఉపాధ్యాయులు అనేక సమస్యలు ఎదుర్కొనాల్సిన పరిస్థితి ఏర్పడుతున్నది.

అదనపు అర్హతల ఇంక్రిమెంట్లు మంజూరు సందర్భంగా ఉపాధ్యాయులను రెండు విధాలుగ పరిశీలించాల్సి ఉంది.

1. ఉద్యోగంలో చేరేనాటికి అదనపు అర్హతలు కలిగియున్నవారు.

Those who have possessed the requisite additional Qualifications at the time of their appointment. (possess means having)

2. ఉద్యోగములో చేరిన తదుపరి అదనపు అర్హతలు సంపాదించినవారు.

Those who have acquired the additional Qualification after their appointment. (acquire means gain or earn)

ఈ నిబంధనలకు చెందిన ఉత్తర్వులలోని 'పొజెస్' మరియు 'అక్వయిర్' అనుపదములను విస్మరించి రెండింటిని సమానార్థకపదములుగ పరిగణించిన యెడల అదనపు అర్హతల ఇంక్రిమెంట్ల మంజూరు సందర్భంగా గందరగోళ పరిస్థితి ఏర్పడగలదు.

1982 - 86 రీగ్రూపింగ్ కాలములో

తేదీ: 1-12-82 మరియు తే. 31-6-86 ల మధ్య కాలంలో, ఉపాధ్యాయుల అదనపు అర్హతల ఇంక్రిమెంట్లమంజూరునకు చెందిన ఉత్తర్వు జి.ఓ. యం.ఎస్. నెం. 135 ఆర్థిక తేదీ. 8-4-93 పేరా 2 (డి) లోని మొదటి వాక్యం ప్రకారం

1 తే 1-12-82 తదుపరి అదనపు అర్హతలు సంపాదించిన (అక్వయిర్) వారు అదనపు అర్హతల ఇంక్రిమెంట్లకు అర్హులు.

పైవాక్యము ననుసరించి తేది. 1-12-82 పూర్వంగాని ఆతదుపరిగాని నియామకం పొందినవారు తేదీ: 1-12-82 తదుపరి నియామకానంతరం అదనపు అర్హతలు సంపాదించిన యెడల అదనపు అర్హతల ఇంక్రిమెంట్లకు అర్హులు.

2. పైపేరాలోని 2వ వాక్యం ప్రకారం తేది 1-12-82 తదుపరి నియామకము పొందియుండి నియామక తేది నాటికి అదనపు అర్హతలు కలిగియున్నవారు (పొజెసిడ్) అదనపు అర్హతల ఇంక్రిమెంట్లు పొందుటకు అర్హులు.

పేరా 2 (ఇ)లోని రెండవ వాక్యము ననుసరించి వీరు నియామకపుతేది నుండి అదనపు అర్హతల ఇంక్రిమెంట్లు పొందవలసియున్నది.

పేరా 2 (జి) వాక్యంలో తేది: 1-12-82కు పూర్వం అదనపు అర్హతలు పొందిన (అక్వయిర్) వారికి ఈ ఉత్తర్వులు వర్తించవు. అని తెలుపబడింది. ఈవాక్యం తే.1-12-82 కు పూర్వం నియమింపబడి యుండి సదరు తేదికి పూర్వం అదనపు అర్హతలు పొందిన వారికి వర్తిస్తుంది. వీరికి 1978 వేతనములలోనే అదనపు అర్హతల ఇంక్రిమెంట్లు మంజూరు కావలసియున్నది కదా! అందువల్ల ఈవాక్యంలో అసమంజసమేమీలేదు. ఈవాక్యాన్ని 'పొజెస్డ్' వారికి అనగా తే 1-12-82 తదుపరి నియమింపబడి, ఉద్యోగంలో చేరేనాటికి అర్హతలు కలిగియున్నవారికి ఉద్దేశించినదికాదు. (ఐ.ఉ.మే '93.)

## 1986 వేతనములలో

తేది: 1-7-86 మరియు తే: 31-12-92 మధ్యకాలంలో అదనపు అర్హతల ఇంక్రిమెంట్లమంజూరు సందర్భంగా ఉపాధ్యాయులకు సంబంధించి జి.ఓ. యం. ఎస్.నెం. 40 ఆర్థిక తేది: 2-2-93 జారీచేయబడింది. (ఐక్య ఉపాధ్యాయ. ఫిబ్రవరి '93.)

1. పైఉత్తర్వులోని పేరా 3 (డి) మొదటివాక్యం ప్రకారం

తేది: 1-7-86 తర్వాత అదనపు అర్హతలు సంపాదించిన వారు (అక్వయిర్/అక్వయిర్డ్) అదనపు అర్హతల ఇంక్రిమెంట్లకు అర్హులు అనితెలుపబడియున్నది. తేది: 1-7-86 తదుపరి అదనపు అర్హతలు సంపాదించిన వారు అ.అ. ఇంక్రిమెంట్లకు అర్హులు.

2. అదేపేరాలోని రెండవ వాక్యంలో తేది: 1-7-86 ఆ తర్వాత నియమింపబడి నియామకము పొందేనాటికే అదనపు అర్హతలు కలిగియున్నవారికి (పొజెస్డ్) అదనపు అర్హతల ఇంక్రిమెంట్లు వర్తించగలవు.

వీరు తే: 1-7-86 పూర్వము అర్హతలు పొందియున్నప్పటికి నియామకము మాత్రమే తే. 1-7-86 తదుపరి జరుగుచున్నకారణంగా అదనపు అర్హతల ఇంక్రిమెంట్లకు అర్హులైయున్నారు.

సదరు జి.ఓ.లోని పేరా 3 నిబంధన (జి) లో తే: 1-7-86కు ముందు అదనపు అర్హతలు పొందిన (అక్వయిర్డ్) వారికి వర్తించవు అనితెలిపియున్నది.

ఈవాక్యములో అసంబద్ధత ఏమీలేదు. జి.ఓ.135 జారీ చేసిన తదుపరి ఈ వాక్యము సరియైనదే తే. 1-7-86కు పూర్వం నియమింపబడి తేది: 1-7-86కు పూర్వమే అదనపు అర్హతలు పొందిన వారు రీగ్రూపింగ్ వేతనముల జి.ఓ. 135 ప్రకారం అ.అ.ఇంక్రిమెంట్లు పొందాల్సిఉందికదా' అందువలన వీరికి '86వేతనాల్లో అ.అ. ఇంక్రిమెంట్లు వర్తించవు.

## ఎస్.జి.బి.టి. షరతు తొలగింపు.

విద్యాశాఖమెమోనెం. 2247 తేది: 28.7.93 ప్రకారం తేది: 31-12-92కు ముందు బి.ఇడి. అర్హతలతో సెకండరీగ్రేడ్ పోస్టులో నియమింపబడినవారికి అదనపు అర్హతల ఇంక్రిమెంటు పొందుటకు వీలుగా ఎస్.జి.బి.టి. షరతు తొలగించబడినది. వీరికి ఒక అడ్వాన్సు ఇంక్రిమెంటు అనుమతించబడుతుంది.

(ఐక్యఉపాధ్యాయ . ఆగష్టు '93.)

మెడిసిన్, ఇంజనీరింగ్, **Bits** సీట్లు సాధించిన అగ్రగామి సంస్థ

# క్రాంతి

## రెసిడెన్షియల్ జూనియర్ కళాశాల

బల్లేపల్లి, ఖమ్మం -2

జిల్లాలో ఉత్తమ ఫలితాలతోపాటు, జిల్లా మొత్తం మీద

అత్యధిక ప్రథమ శ్రేణులు సాధించిన సందర్భంలో

విద్యార్థులకు శుభాకాంక్షలు.

ఈ విజయానికి కారకులైన ప్రతి ఒక్కరికి

మా హృదయపూర్వక కృతజ్ఞతలు.

## ఫలితాలు

మొత్తం హాజరైన విద్యార్థులు : **141**

ఉత్తీర్ణులు **131**

ప్రథమశ్రేణి **92**

తెలంగాణా (హైదరాబాదు మినహా) మొత్తం మీద
అత్యధిక ఫస్ట్‌క్లాసులు సాధించిన క్రాంతి విద్యార్థులు

**M.P.C., Bi.P.C. (EM & TM)** లకు
అడ్మిషన్లు కొరకు సంప్రదించండి.

ఇట్లు
మేనేజ్‌మెంట్

ఈ మెమోననుసరించి రీగ్రూపింగ్ వేతనాల్లోనూ, '86 వేతనాల్లోనూ సెకండరీగ్రేడ్ పోస్టులో నియమింపబడిన బి.ఇడి. ఉపాధ్యాయులు ఒక అదనపు అర్హతల ఇంక్రిమెంటుకు అర్హులు. ఇతర అదనపు అర్హతలకు ప్రభుత్వ ఉత్తర్వులననుసరించి ఇంక్రిమెంట్లు లభించగలవు.

రీగ్రూపింగ్ (82-86) మధ్యకాలంలో సెకండరీగ్రేడ్‌గా నియమింప బడిన బి.ఇడి. ఉపాధ్యాయులకు పైమెమో వర్తించదని విపరీతమైన వ్యాఖ్యానాలు చేయడం ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నది. జి.ఒ. 182 సూచికలో పొందుపరిచిన కారణంలో '86 వేతనములలో వారికి మాత్రమే వర్తిస్తాయని చెప్పడం ఉత్తర్వులకు వక్రభాష్యం కల్పించడమే!

జి.ఒ. 182 తేది 17-7-87 ఉత్తర్వు 1978 వేతనములలో కొనసాగింపుగా జారీచేయబడినదనియూ రీగ్రూపింగ్ వేతనములకారణంగా సదరు జి.ఒ.ఉపాధ్యాయులకు వర్తించదనిచెప్పి అమలుపరుచని కారణంగా 182 జి.ఒ. ప్రకారం అ.అ. ఇంక్రిమెట్లుపొందిన వారికి రికవరీచేసిన కారణంగాను ఉపాధ్యాయసంఘాల కృషిఫలితంగా '86వేతనాల్లో ఉపాధ్యాయుల అదనపు అర్హతల ఇంక్రిమెంట్లకు జి.ఒ. 40తేది 2-2-93 జారీచేయడం జరిగింది. వాస్తవం ఈ విధంగా ఉండగా ఉపాధ్యాయులకు వర్తింపజేయని ఉత్తర్వును చూపించి అ.అ. ఇంక్రిమెంట్లను నిరాకరించడం అక్రమం, అన్యాయం.

జి.ఒ. 182. '78 పే స్కేల్సునకుకొనసాగింపుగా జారీచేసిన కారణంగాను, ఉపాధ్యాయులకు '78 వేతనములలోను, రీగ్రూపింగ్ వేతనములలోను అదనపు అర్హతల ఇంక్రిమెంట్లు అనుమతించిన కారణంగాను మెమో 2247 కూడా రీగ్రూపింగ్ వేతనముల కాలానికి కూడా వర్తించగలదు.

## ఇతర నిబంధనలు

1. రీగ్రూపింగ్ వేతనములో (82-86) మంజూరు చేయబడిన అ.అ. ఇంక్రిమెంట్లు 86 వేతనములలో విలీనంచేయబడి వేతనపునఃస్థిరీకరణ చేయబడతాయి. వీటిపై డి.ఎ., 10% వెయిటేజి కూడా వర్తిస్తుంది.

2. '86 వేతనములలో పొందిన. అ.అ. ఇంక్రిమెంట్లు సర్వీసుమొత్తం వ్యక్తిగతవేతనంగా కొనసాగుతాయి. '93 వేతనములలో వీటిపై డి.ఎ.మాత్రం పేఫిక్సేషనుకు లెక్కించబడుతుంది. 10% వెయిటేజికి వర్తించవు.

3. రీగ్రూపింగ్ వేతనములలోను '86 వేతనములలోను అ.అ.ఇంక్రిమెంటు ఆర్థికలాభము తే. 1.7.86నుండి తదుపరి అర్హతపొందిన తేది నుండి వస్తుంది.

4. '86 వేతనములు అ.అ.ఇంక్రి మెంట్లపై '86 వేతనములలో డి.ఎ., హెచ్.ఆర్.ఎ.లు అనుమతించబడవు.

5. స్వంత ఖర్చు లేక ప్రభుత్వఖర్చుతో చదివిన వారికందరికి అ.అ. ఇంక్రిమెంటు వర్తిస్తాయి.

6. జి.ఒ. యం. ఎస్. నెం. 177 ఆర్థిక తేది 28-6-88 (అ.ద.4.పేజి.233) ప్రకారం 'వ్యక్తిగత వేతనం', 'ప్రత్యేకవేతనం' 'పెన్షను' లెక్కింపుకు పరిగణింపబడవు.

7. హిందీ 'సాహిత్యరత్న'ను జి.ఒ.యం.ఎస్. నెం.96 విద్య తేది. 31-1-81 మేరకు ఎం.ఎ.తో సమానముగ పరిగణింపబడుటను పరిశీలించవచ్చు.

జి.ఒ.యం.ఎస్.నెం.1415 విద్య తేది: 22-7-70 (అ.ద.5.పేజి 158లో (సాహిత్యరత్న) పరీక్షను హిందీలో బి.ఎ. (ఆనర్స్)గా పరిగణింపబడింది. బి.ఎ. (ఆనర్స్) ఎం.ఎ. తోసమానముగ పరిగణింపబడుటను 'సాహిత్యరత్న' కు చెందిన ఉత్తర్వు జి.ఒ.యం.ఎస్ నెం.835 విద్య తే.14-11-80 పేరా 2లో పరిశీలించవచ్చు (అ.ద.5. పే.జి. 165)

8. అదనపు అర్హతలు నిర్వహిస్తున్న పోస్టునకు చెందినవై యుండాలి.

9. రెగ్యులర్ ఇంక్రిమెంటు యథాతథంగా 'ఇంక్రిమెంటుతేది' కి మంజూరుచేయబడుతుంది.

10. అ.అ.ఇంక్రిమెంటు 'రేటు' అర్హతలు పొందిన లేక నియామకము పొందిననాటి వేతనస్కేలులోని ఇంక్రిమెంటు ప్రకారం సందర్భానుసారముగ చెల్లించబడుతుంది.

11. 15/22 సం॥ స్కేళ్లు పొందిన తదుపరి అదనపు అర్హతలు సంపాదించినవారు అ.అ. ఇంక్రిమెంట్లకు అర్హులుకారు. మెమో. నెం.1043 డి.ఎస్.ఇ. తేది: 1-9-93 ప్రకారం పోస్ట్ గ్రాడ్యుయేషన్‌కు మాత్రము అ.అ.ఇంక్రిమెంటునకు అర్హులు.

12. తే: 1-7-86 తదుపరి అదనపు అర్హతల ఇంక్రిమెంట్లు పొందిన తదనంతరము 15/22 సం॥ స్కేళ్లు పొందిన వారు జి.ఒ. 40 తేది. 2-2-93 ననుసరించి అ.అ. ఇంక్రిమెంట్లు సర్వీసుకాలమంతయు కొనసాగుతాయి. వీరికి రెగ్యులర్ పోస్టుకు పదోన్నతి పొందిననూ సర్వీసంతా కొనసాగుతాయి.

13. 1993 వేతనాలు 1.7.92 నుండి అమలులోనికి వచ్చాయి. ఆతర్వాత అదనపు యింక్రిమెంట్లు పొంది ఆతేదినాటికే నూతన స్కేళ్లకు ఆప్షను యిచ్చిన వారివిషయంలో ప్రభుత్వ ఉత్తర్వులు రావలసియున్నది.

### హైద్రాబాద్ యు.టి.యఫ్. భవననిధి

| | |
|---|---|
| గతనెలవరకు ప్రకటించినది. | 2,01,334-00 |
| మహాసభల నుండి జమ | 10,000-00 |
| శ్రీ. వి.వి. రమాకామేశ్వరి చల్లపల్లి కృష్ణ | 116-00 |
| శ్రీ. మధుసూదనరెడ్డి రజిత నల్గొండ | 116-00 |
| శ్రీ. పి. మల్లి ఖార్జునరావు కొత్తపేట తూ.గో. | 25-00 |
| శ్రీ. జి. చిన్నారావు భద్రాచలం ఖమ్మం | 100-00 |
| శ్రీ. వి. రవిప్రకాష్ మహబూబ్‌నగర్ | 116-00 |
| శ్రీ. వి. రంగారావు విజయవాడ కృష్ణ | 200-00 |
| శ్రీ. సిహెచ్. పట్టాభిరామయ్య, వర్ని నిజాంబ.ప 500-00 | |
| శ్రీ. కె. మల్లారెడ్డి మాంచాల రంగారెడ్డి | 116-00 |
| శ్రీమతి యస్. సరోజాదేవి, హైద్రాబాద్ | 500-00 |
| శ్రీ.పి. మల్లయ్య, రంగారెడ్డి | 200-00 |
| శ్రీ.జి. బాలకృష్ణారెడ్డి వలిగొండ నల్గొండ | 200-00 |
| శ్రీ.పి. పాపిరెడ్డి పంతంగి నల్గొండ | 200-00 |
| శ్రీ.యం. రాయన్న గుంటూరు | 500-00 |
| శ్రీ. సిహెచ్. వి. బ్రహ్మం గుంటూరు | 116-00 |
| శ్రీ. రంగదొరై నర్సారావుపేట గుంటూరు | 116-00 |
| మొత్తం | 2,14,455.00 |



అనుభవజ్ఞులైన అధ్యాపకుల పర్యవేక్షణలో

వ్యవస్థాపకులే అధ్యాపకులుగా




# పబ్లిక్‌స్కూల్

పటమట, విజయవాడ Ph:476176

క్లాసులు: LKG to X ఇ.మీ

# హైస్కూల్

పటమట, విజయవాడ

క్లాసులు: 6 To X తె.మీ

## గత నాలుగు సంవత్సరాలు మా S.S.C. ఘన విజయాలు

| విద్యాసంవత్సరం | హాజరైనవారు | పాసైనవారు | శాతం |
|---|---|---|---|
| 90-91 | 92 | 87 | 95% |
| 91-92 | 141 | 133 | 95% |
| 93-94 | 165 | 160 | 97% |

| | | | | |
|---|---|---|---|---|
| అడ్మిషన్లు జరుగుచున్నవి | కంప్యూటర్ శిక్షణ | క్లాసులుప్రారంభం 6-6-94 | ప్రత్యేకస్టడీ క్లాసులు | బాలబాలికలకు హాస్టల్‌వసతి |

ప్రిన్సిపాల్

**G.V.S.V.** ప్రసాద్ B.Sc.B.Ed.

# పాఠ్యగ్రంథాల తీరుతెన్నులు

## విమర్శ అభివృద్ధికి రాచబాట

- నన్నపనేని రమాదేవి

విమర్శలేని చోట, చర్చ జరగని చోట, మేధస్సులు ఘర్షించుకోని చోట ప్రగతి కుంటుబడుతుంది; అభివృద్ధి ఆగిపోతుంది. విషయం నేర్చుకోదలచిన వారు చర్చకి సిద్ధపడి వుండాలి, సవాళ్ళను సైతం సవినయంగానే స్వీకరించగలగాలి. నాకా నమ్రత ఉందనే నేననుకుంటున్నాను.

పాఠ్యగ్రంథాలలో నాదృష్టికి రాని, వచ్చీ కావాలనే ప్రస్తావించని మరికొన్ని అంశాలను, విమర్శ ఎలా ఉండాలి అన్న విషయంపై కొన్ని సూచనలను చేస్తూ గత సంచికలో బి. నరసింహారావు గారు వ్యాసం రాశారు. పాఠ్య గ్రంథాలలో అనేక పొరపాట్లు దొర్లాయని నేను రాస్తూ వచ్చిన వ్యాసాల్లోని వాదనని మరింత బలోపేతం చేసే, మరికొన్ని పొరపాట్లను వారు మన దృష్టికి తెచ్చినందుకు వారికి నా కృతజ్ఞతలు. మా ఇద్దరి దృష్టికిరాని విషయాలు ఇంకా ఈ వాచకాల్లో ఉండవచ్చు. అవన్నీ కలిస్తేగాని పాఠ్యగ్రంథాలపై వ్యాసాలు సమగ్రాలు కావు.

బి.ఎన్. గారి వ్యాసంలో సగానికి పైగా వారు స్వంతంగా వాచకాల్లో గమనించిన పొరపాట్ల గురించీ (బాలవీరులు, 9వ తరగతి వాచకంపై విమర్శ), మిగతా సగం నా వ్యాసాలపై " విమర్శ ఎలా ఉండాల"న్న అంశం మీద రాశారు. నా మీద వచ్చిన విమర్శలకు సమాధానం చెప్పటం నా బాధ్యతగా నేను భావిస్తున్నాను.

బి.ఎన్. గారు నా వ్యాసాలపై ప్రకటించిన అభిప్రాయాలు - నా వివరణ

1. "ఆధునిక ఇంగ్లీషు భాషా శాస్త్రవేత్తలు భాష, వ్యక్తీకరణలలో కొన్ని లక్షణాలుండాలన్నారు. ఇవి అన్ని విషయాలకూ వర్తిస్తాయి. అవి సంక్షిప్తత, స్పష్టత, సూటి దనం. ఈ లక్షణాలు విమర్శనా వ్యాసాలలో లోపించాయి.

- బి. ఎన్.

- అవి ఆరోగ్యకరమైన లక్షణాలని నేనంగీకరిస్తున్నాను. వ్యాసం కూడా వ్యక్తీకరణలో భాగమే. ఒక విషయాన్నిమొదటిసారిగా రాసే వ్యాసాలకీ లక్షణాలను వర్తింపజేయటం సులభమే. పాఠ్య గ్రంథాలపై వ్యాసాలు ఈకోవకి చెందినవి కావు. ఒకటి నుండి పదవ తరగతి వరకున్న ఒక సిరీస్ మొత్తాన్ని, నిశితంగా, కూలంకషంగా పరిశీలించే ప్రయత్నం; భాషని ప్రవేశపెట్టిన విధానం, భావనాక్రమం (Conceptual Sequence), ఇంక్రిమెంటల్ డోస్, భాషా బోధనాపద్ధతులు, విద్యా రంగంలో ఆధునిక పోకడల అన్వయం, విషయం, విషయంలోని హేతుబద్ధత, మనో విజ్ఞాన శాస్త్రం సూచనలు, వీటన్నిటి చర్చ; ఎక్కడ ఏ పొరపాటు దొర్లిందో, అదెలా పొరపాటయిందో, దాన్ని వివరించే ప్రమాణాలేమిటో, ఎలా ఉండటం సరయిందో - ఇలా అనేక అంశాలను ప్రస్తావించిన పాఠ్యగ్రంథాల వ్యాసాలు సమీక్ష, విమర్శల పరిధిని మించిన విశ్లేషణా వ్యాసాలు కూడా. విషయ స్వభావాన్ని బట్టి నిడివి పెరుగుతుంది కానీ ఈ " కొలబద్దల" కోసం గిరిగీసుకొని ఆగదు. అలా ఆగితే "సిద్ధాంత వ్యాసాల్లాంటివి' రావు, విజ్ఞాన శాస్త్రాలు ఎదగవు. ఒక సూత్రాన్నే అన్ని సందర్భాల్లోనూ అన్వయిస్తే "పెళ్ళికీ, చావుకీ ఒకే మంత్రం' ' లాగుంటుంది. సామాన్యీకరణంగా చూస్తే విషయానికి/ సూత్రానికి కూడా మినహా యింపులుంటాయి. "కట్టె కొట్టె తెచ్చె" పద్ధతిలో ఈ వ్యాసాలని రాస్తే విషయం అస్పష్టంగా, అసమగ్రంగా ఉంటుంది.

2. "రాసేది తమ అభిప్రాయాలు తెలియజేయటానికే గాని, తమ పాండిత్య ప్రకర్షా ప్రదర్శనకు కాదు అని రచయితలు గుర్తుంచుకోవాలి - అని కూడా భాషా శాస్త్రవేత్తలన్నారు. రచయిత్రి ఈ విషయం గుర్తుంచుకున్నట్లు కనపడదు.".

బి.ఎన్.

. Tubular Vision తో చూడకూడదు. "విమర్శ ఎలా ఉండాలి' అని రాసే వారికి సున్నితంగా విమర్శించటం "సద్విమర్శా" లక్షణమని తెలియదని నేననుకోవటం లేదు. ఈరెండు వ్యాసాల్లోనూ తెలుగు, ఇంగ్లీషు భాషా శాస్త్రాల్లో హేమాహేమీలయిన వారి సందర్భో (Techniques of Teaching English రచయిత A.N. KoHLI తో సహా) సందర్భానుసారంగా పేర్కొన్నాను. వారి రచనలన్నిటినీ చదివాను. విమర్శకుడే భాషా శాస్త్రవేత్తల చాటున దాక్కున్నారనిపిస్తుంది. పాండిత్య ప్రకర్ష ప్రదర్శన కోసం రాసే వారికే ఈ విమర్శ వర్తిస్తుంది.

3. "తెలుగు పాఠ్యగ్రంథ విమర్శనలో భాషాపరమైన లోపాలనే ఎత్తిచూపాలి. ఈ మౌలికాంశాన్ని రచయిత్రి విస్మరించారు".

- బి.ఎన్

...... భాషాబోధన తొలిదశలో భాషాపరమైన విషయాలకి ప్రాధాన్యం ఉంటుంది. భాషనేర్పే క్రమం పూర్తయ్యాక భాష, విషయంలో భాగంగా ఉంటుంది. 1991 అక్టోబరు నుండి రాసిన వ్యాసాల్లో మొదటి 7, 8 వ్యాసాల్లో భాషాపరమైన లోపాలనే ప్రధానంగా ఎత్తి చూపాను, మిగతా అంశాలకి రెండవస్థానమే ఇచ్చాను. ఈ అంశాన్ని బి.యన్‌గారు విస్మరించారు. పైగా బి.యన్.గారి వాదనలో ఒక లోపమేమంటే "మిగతా అంశాలకన్న భాషాపరమయిన లోపాలకు ప్రాధాన్యత నివ్వాలన" కుండా "భాషాపరమైన లోపాలనే ఎత్తిచూపాల"ని assertive sentence వాడారు. భావనలూ, విషయమూ లేకుండా భాష బ్రతకలేదు. భాషనొక్కదాన్నే పట్టుకొని కూర్చుంటే విజ్ఞాన శాస్త్రాలేవీ ఎదిగే సమస్యేలేదు.

ఉదా : 8వ తరగతి తెలుగు వాచకంలో "పౌరహక్కులు" అనే పాఠం ఉంది. తెలుగు వాచకంలో భాషని నేర్పా విషయాలూ,

# టీచర్స్ రిక్రూట్‌మెంట్

జిల్లా సెలక్షన్ కమిటీవారిచే జిల్లా ప్రజాపరిషత్ పాఠశాలల టీచర్ల నియామకం కోసం నిర్వహించబోయే సమగ్రమైన మెటీరియల్‌తో గైడు వెలువడినది.



**V.G.S. PUBLISHERS**
11-63-6, Brahmin Street,
VIJAYAWADA - 1

తెలుగు సాహిత్యంలోని అంశాలూ ఇవ్వక "విషయప్రాధాన్య' 'మున్న ఈ అంశాన్నెందుకిచ్చారు? ఇందులో భాషాపరమైన లోపాలేమీ లేవు. భావనాపరమైన లోపాలు కొన్ని దొర్లాయి. బి.యన్‌గారి ప్రకారం అయితే మనం 'పౌరహక్కుల 'పేరిట దొర్లిన ఈ తప్పులన్నిటినీ చర్చించకూడదు.

4. "ఒక తరగతి యొక్క రెండు, మూడు పాఠాలను తీసికొని, కొన్ని విషయాల హేతుబద్ధతపై మాత్రమే రచయిత్రి తన విమర్శనను కేంద్రీకరించారు. ఇది సరైన విమర్శకాదు" - బి.యన్.

...... నేను సుమారుగా పాతికవ్యాసాలు రాస్తే, అందులో మూడు వ్యాసాలు (3, 6, 9 తరగతులు) మాత్రమే తీసుకుని, ఆ మూడు వ్యాసాల్లో కూడా మొత్తం అంశాల జోలికి పోకుండా కొన్ని విషయాల హేతుబద్ధతమీద మాత్రమే బి.యన్. గారీ వ్యాసంలోతన విమర్శననెలా కేంద్రీకరించారో, సరిగ్గా అకారణంతోనే నేను అలా రాశాను. మనిషి, మనిషికీ ఓ న్యాయం ఉండదు.

. ఓ బుట్ట వంకాయలన్నీ వెదికి పుచ్చిన వంకాయలను ఏరి ఇవతల పడేస్తే., మిగతావెందుకు ఏరి పడెయ్యలేదంటే జవాబేంటి? అన్నీ బావుండి కొన్నే బావుండకపోతే ఆ కొన్నిటి గురించే చెప్తాం. అన్నిటినీ ఏకరువు పెట్టం. కొన్ని సందర్భాల్లో ఒకే విమర్శకి లొంగే విషయాలు చాలా ఉన్నప్పుడు ఒకటి రెండింటినే ఉదహరిస్తాం.

' ఓ పక్క నిడివి పెరిగిందన్న విమర్శా, మరో పక్క అన్నిటినీ చర్చించలేదన్న విమర్శా - రెంటికీ పొంతన కుదురుతుందా? "కుండలో కూడు కుండలోనే ఉండాలి, పిల్లలు మాత్రం దుక్కల్లా ఉండాలి"- అనే బైపు వాదనిది.

5. "విమర్శలో ఉపదేశాలు, సైద్ధాంతిక చర్చ ఎక్కువగా వున్నాయి. వాచకంలోని అసలు లోపాల వివరణ అడుగున పడిపోయింది. ఇది సక్రమ విమర్శా విధానం కాదు". బి.యన్.

...... ఇలా ఉండటం సరయిందికాదని విమర్శకి దిగేవారికి ఎలా ఉంటే సరయిందో కూడా చెప్పే బాధ్యతుంటుంది. ఆబాధ్యతల భాగంగా చేసే ప్రతిపాదనలని "సూచనలు" అంటారు. "ఉపదేశాలు" అనరు. వాచకాల్లోని లోపాలను ఎత్తిచూపుతూ నేను చేసిన సూచనలను బి.యన్‌గారు "ఉపదేశాలు" అని పిలిస్తే, ఇప్పుడు నా వ్యాసాలపై వారు చేసిన సూచనలు కూడా ఉపదేశాలే అవుతాయి.

వాచకంలోని లోపాల వివరణా కార్యక్రమంలో భాగంగానే సైద్ధాంతిక చర్చ జరిగింది తప్ప, ఆసందర్భంగా జరగలేదు. ఇంతవరకూ రాసిన విషయాలలో అసలు లోపాలు విస్మరించటం అనేది అసలు జరగలేదు.

6. అనవసర విషయాలు : ఈ హెడింగ్ క్రింద క్రింది బి.యన్.గారిచ్చిన మూడు ఉదాహరణలకి రిఫరెన్సులు

ఎ) రవీంద్ర నాథ్ ఠాగూర్ "తోతాకహానీ"కి - ఆగస్టు 92 ఐక్యఉపాధ్యాయ

బి) త్రిపురనేని మధుసూధనరావు గారి అభిప్రాయాలు "

సి) రంగనాయకమ్మ మాటలు ఏప్రిల్ 92

ఆయా వ్యాసాలలోని విషయానికీ, "అనవసర విషయాలు' 'గా బి.యన్‌గారు భావించిన అంశాలకీ మధ్య సంబంధం తరచి చూడటానికి ఈ రిఫరెన్సులు చూడాలి.

A. "తోతా కహానీ" హిందీపదం. దాన్ని "చిలుక కథ" అనవచ్చు కద. బి.యన్.

రవీంద్రనాథ్ బెంగాలీలో రాసిన కథకి హిందీ అనువాదమే నేను చదివాను. నాకు బెంగాలీ భాషరానందున. "జన గణ మణ" అని తెలుగువారమయివుండీ బెంగాలీలో ఎందుకు పాడుతున్నాం? "వందేమాతరం"సంస్కృతగీతం కాదా? Letter to His daughter అని నెహ్రూ రాసిన పుస్తకాన్ని "కూతురికి ఉత్తరాలు" అని ఎవరయినా అనువదించి చెప్తారా? "హమారా దేశ్" కార్యక్రమాన్ని ఆంధ్రదేశంలోనూ తెలుగులో "మన దేశం' 'అనక హమారాదేశ్ అనే ఎందుకు జరిపారు? బంద్, రాస్తారోకో, చలో ఢిల్లీ - పిలుపులని ప్రాంతీయ భాషల్లో ఎందుకివ్వరు? జనం నోట పాపులర్ అయిన పదాల్ని, అలా చెప్పటమే ఎక్కువ ప్రయోజనకరమైన విషయం.

7. అసంపూర్ణ అధ్యయనం : పేరుతో నాగ మహాశయులకి వివరణ అవసరం లేదని బి.యన్.గారు రాశారు. ఒప్పుకుంటున్నాను. నాది అసంపూర్ణ అధ్యయనమే! ఎప్పటికీ పరిపూర్ణత్వం సాధించానని చెప్పలేను కూడా. ఒక విషయాన్ని "సంపూర్ణంగా" అధ్యయనం చేశానని ఎవరయినా అంటే అది వారి అహంభావానికి తార్కాణమవుతుంది.

- దుర్గాచరణ్ నాగ్ బాల్యంలో అతని ధైర్య సాహసాలకు సంబంధించిన ఒక్క అంశాన్ని మాత్రమే పాఠ్యభాగంలో ప్రస్తావించి "నాగ మహాశయుల"న్న పదం వాడారు వాచకరచయితలు. అతన్ని మహాశయుడుగా నిరూపించే విషయాన్ని చెప్తే రిలవెంట్‌గా ఉంటుందన్నదే నా వాదన. రాముడు తాటకిని చంపిన వైనాన్ని వివరించే ఏకాంశమున్న పాఠ్యభాగంలో "రాముడు ఏకపత్నీ వ్రతుడు అని చెప్పాల్సిన అవసరం ఉండదు. రాముడి జీవితంలోకొన్నో, లేక మొత్తమో విషయాలు చెప్పే పాఠ్యభాగంలో ఆ పదం వాడవచ్చు.

కార్యదర్శి (యు.టి.యఫ్0

చిత్తూరుజిల్లా.

విద్యారంగంలో 23 సం॥ల విశిష్ట కృషి సల్పుచున్న శ్రీ పి. కోటేశ్వరరావు గారి ఆధ్వర్యములో నడుపబడుచున్న విద్యాసంస్థలు



# రవీంద్ర భారతి హైస్కూల్

శివశంకర్ నగర్, పటమట,

విజయవాడ - 10, ఫోన్ : 476307.

కరస్పాండెంట్
**పి. కోటేశ్వరరావు**

డైరెక్టర్
**ఎ. ఆదినారాయణరావు** M.A.,B.Ed.,

**7th కామన్ లో జిలా ర్యాంకు హోల్డర్లు వీరే**



డి. గంగాభవాని



హిదయతున్నీసాబేగం



పి. మహాలక్ష్మి



టి. వెంకటలక్ష్మి



కె. మల్లిఖార్జునరావు



ఎ. పవన్‌కుమార్

**1993 - 94 S.S.C. లో అన్నీ ఫస్టు క్లాసులే. 100%**

**7th కామన్‌లో కృష్ణాజిల్లాలో 10వ ర్యాంకు, విజయవాడ నగరంలో Ist ర్యాంకు సాధించిన**



ఎస్. మాధవి 458/500

**గత 13 సం॥ నుండి 7th కామన్‌లో 90 శాతం మార్కులతో 100% ఉత్తీర్ణత**

# రవీంద్రభారతి పబ్లిక్ స్కూల్

దొంకరోడ్, పటమట, విజయవాడ - 10

**సెంట్రల్ సిలబస్‌తో L.K.G. నుండి 5th క్లాసు వరకు**

**అడ్మిషన్లు జరుగుచున్నవి**

**క్లాసులు ప్రారంభం. 13-6-94**

**పి. కోటేశ్వరరావు**
*(కరస్పాండెంట్)*

**శ్రీమతి కె. జానకి** B.Sc., B.Ed.,
*(ప్రిన్సిపాల్)*

8. సక్రమంగాలేని వ్యాస వాక్య నిర్మాణం : బి.యస్ అందుకిచ్చిన ఉదాహరణ:

"ఒకటా రెండా యింతవరకు పిల్లలు చదివిన వాచకాలన్నీ ఏ విషయంలో చూసినా సవాలక్షతప్పులతడకలే".

ఎ) ఈ వాక్యంలో రెండా తర్వాత కామా ఉండాలి. బి.యస్.

..... నేను ఐక్య ఉపాధ్యాయకి పంపిన వ్యాసంలో కామా ఉంది, దాని ) నా దగ్గరుంది అచ్చు తప్పయిన దాంట్లో నా బాధ్యత లేదు.

బి) "యింతవరకు" కాదు "ఇంతవరకు" అని రాయాలి. - బి.యస్.

... వాక్య ప్రారంభంలోనూ, పేరా ప్రారంభంలోనూ అచ్చులను వాడినా, మధ్యలో హల్లులు వాడవచ్చన్నది వ్యవహారిక భాషావాదంలో ఏనాడో నెగ్గిన విషయం. చలం, వడ్డెర చండీదాస్ (హిమజ్వాల) - లాంటి వారు తమరచనల్లో ఈ ప్రయోగాన్ని విస్తృతంగా చేశారు.

సి) "సవాలక్ష తప్పుల తడకలు" ప్రయోగం తప్పు. "తడికెలు" అంటాం. "తడకలు" అనం. "తప్పుల తడికెలు" అనేదిసరైన ప్రయోగం. -బి.యస్.

. Assertive sentence రాశారు. బి.యస్. గారు ఇది సరయిందికాదేమో అనకుండా ఇది తప్పు, ఇది కరెక్ట్ అని ఘంటాపథంగా చెప్తున్నారు.

C.P Brown నిఘంటువు మంచి ప్రామాణిక నిఘంటువు. ఆ నిఘంటువులో 503 వపేజలో తడక లేక తడిక ( tadaka = ఉచ్ఛరించే విధానం) అని ఉంది. ఉత్త తడక పదమేకాక అదేపేజలో "తప్పుల తడక' పదం యథాతథంగా ఉంది. a pack of contradictions, a parcel of blunders, a heap or tissue of falsehoods అని వివరణ ఉంది.

ఇదే తప్పుల తడక ప్రయోగం తూమాటి దొణప్పగారి "వ్యావహారిక భాషోద్యమ నేపథ్యం గిడుగువారి సారథ్యం" వ్యాసంలో (197 పేజీ మొదటిపేరా) ను, ఆ వ్యాసం చేకూరి రామారావు గారి "మరోసారి గిడుగురామమూర్తి" పుస్తకంలోనూ ఉంది. బ్రౌన్ కన్న, తూమాటి దొణప్పగారికన్న మన పాండిత్యం మించినదికాదు. ఈప్రయోగం తప్పు...తే ఈ విమర్శ వీరిద్దరికి కూడా వర్తిస్తుంది. బి.యస్.గారు తమ స్వయం ప్రతిభతో తప్పులుకాని వాటిని కూడా తప్పులుగా చూపుతున్నారు.

డి) "కలగాపులగం చేస్తున్నాసని" - మరో విమర్శ.

ఎ, బి, సి ల క్రింద చేసిన విమర్శాంశాలతోనే కలగాపులగం అయిందని వారు భావించారు. "కలగాపులగం" చేసి చూశారువారు. ఆ వాక్యం దాని మానాన అది చక్కగానే ఉంది

9. భూమికలోని వాక్యాల విస్తరణ, పిల్లలు చెడిపోతారనే హెచ్చరిక, అందరికీ కర్తవ్య బోధ, ఆయుర్వేద భాగాల ఉటంకింపు, ఇంద్రియ పటుత్వంపై దీర్ఘ వివరణ మొ॥వ వాటితో రచయిత్రి విమర్శనని నింపేశారు. - బి.యస్.

.... వాచకంలోని విషయాన్ని, భూమికనీ, అదనపు సమాచారంగా అందించిన విషయాల్ని వేటినీ స్పృశించకుండా విమర్శ ఒక్క భాషమీదే చేయాలని బి.యస్‌గారు భావిస్తున్నందున ఈ రకమైన విమర్శ పెట్టారు. ఆయా విషయాలెందుకు అప్రస్తుతాలో వారు చెప్పాల్సి ఉంది. అవేవీ అనవసర విషయాలుగా "ఇప్పటికీ' నేను భావించటం లేదు.

11 భాష, వాక్య నిర్మాణం చాల మాయమ్మంగా ఉంది ...... "కనపడీ కనపడనట్టు పోతే విద్యార్థుల పట్టి దానిమీద అంటా

పోయే అవకాశం లేదుకానీ, మరీ ఇంతంత వివరణనిచ్చాక ఇక బుర్రల్లోకెక్కకుండా, పురుగుల్లా తొలవకుండా ఎలా పోతుంది?" - ఈ వాక్యం ఎవరికర్థం అవుతుంది? బి.యస్

... తెలుగు వ్యాకరణం సామాన్య వాక్యాలతోపాటు, సంశ్లిష్ట వాక్యాలని, సంయుక్త వాక్యాలని కూడా అనుమతించింది.

"మాట్లాడే భాష చిన్న చిన్న వాక్యాలుగానే వుంటుంది ఎందుకంటే అది ఎప్పుడూ సంభాషణ రూపంలోనే వుంటుంది కనుక. మాట్లాడేటప్పుడు మన భావ వ్యక్తీకరణలో కొంత పాత్ర హావభావాలు, ముఖకవళికలు, శరీరాంగాలు, కంఠస్వరం తీసుకొంటాయి. కనుక మాట్లాడేటప్పుడు చిన్న వాక్యాలు సరిపోతాయి. కానీ రాసే భాష సంగతి అలా కాదు. రాసే భాషలో పెద్ద వాక్యాలు ఏర్పడటానికి "అవకాశమే" కాదు, "అవసరం' కూడా వుంటుంది. ఒక్కోచోట కొన్ని అంశాల్ని కలిపి ఒకే సంబంధంతో, ఒకే వాక్యంగా చెప్పవలసి వస్తూ ఉంటుంది. అలాంటి సందర్భాల్లో కొంత కొంత పెద్ద వాక్యాలే తప్పని సరవుతాయి. - (రంగనాయకమ్మగారి "వాడుక భాషే రాస్తున్నామా?" నుంచి 117, 118 పేజీలు)

పై వాక్యంపై బి.యస్.గారి అభ్యంతరాలు :

ఎ) "పోవు" పదం ఇన్నిసార్లు వాడటం శైలి లోపం - బి.యస్.

- లాక్షణికులు చాలా విషయాల గురించి మంచిచెడులను స్పష్టంగా చెప్పగలిగారు గాని "ఇది శైలిలోపం" అని మాత్రం చెప్పలేక "అది వారి శైలి, ఇది వీరి శైలి" అని ఊరుకున్నారు.

"విద్యార్థుల వ్యాస రచనలోగాని, పరీక్షల జవాబు పత్రాల్లోగాని వాడుక భాషా ప్రయోగాలు తెలిసో, తెలీకో దొర్లితే ఇలా ఊరర్థులు నారబ్బులుగా పెదబొబ్బలు పెట్టేవారు. వీర గ్రాంథిక భాషాభిమానులైన పంతుళ్ళు" అని తూమాటి దొణప్ప గారు ఒక వాక్యం రాశారు. ("మరోసారి గిడుగు రామమూర్తి", 197 పేజీ) ఇందులో " "బొబ్బలు" అనే పదం repeat అయింది. తెలుగు సాహిత్యంలో ఇలాంటి ప్రయోగాలు కుప్పలు తెప్పలుగా చేసి దాఖలాలున్నాయి.

బి) "కనపడీకనపడనట్టు పోయేది" ఏమిటి? అసలు "కనపడే కనపడనట్టు పోవడం" అంటే అర్థం ఏమిటి? బి.యస్.

.... "కుతర్కం" అని దీనర్థం.

తెలుగు జీవభాష. వినీ విననట్టు, చూసీ చూడనట్టు, నమ్మీనమ్మనట్టు, కనిపించీ కనిపించనట్టు - లాంటి ప్రయోగాలని "అనింద్య గ్రామ్యా"లంటారు. వ్యాకరణంలో.

రిఫరెన్స్ : "వ్యావహారిక భాషోద్యమ నేపథ్యం - గిడుగువారి సారథ్యం" వ్యాసం - తూమాటి దొణప్ప . ( 198, 199 పేజీలు "మరోసారి గిడుగు రామమూర్తి""జనరంజనం కోసమో, యుటిలిటి స్ఫూర్తి కోసమో ప్రయుక్తమైన మహాకవులని కాగా కవులు శురంకులున్న సాకుచూపి, ఈప్రయోగాలకు వారి ఔద్ధత్యం కారణమని సర్దిచెపుతూ వాటికి "అనింద్యగ్రామ్యాల"ని పేరుపెట్టి సరిపెట్టకుంటూ వచ్చారు లాక్షణికులు. లక్షణ విరుద్ధమైన భాష గ్రామ్యమనీ, తాము విధించిన నియమ నిబంధనలకు లొంగని ప్రయోగరీతి అగ్రాహ్యమనీ వీరు ఎప్పటికప్పుడు హెచ్చరికలు చేస్తూ, వాడుక భాషా ప్రయోగాలను నిషేధిస్తూ, జనప్రియ ధోరణిని నిరోధిస్తూ, కట్టుదిట్టంగా బోలెడు గ్రంథం నడిపించారు.

ఇలాగా తరతరాలుగా లాక్షణికులు నిరాకరించినా, సంప్రదాయ వాదులు నిరాదరించినా అనునిత్యం జనుల

నాల్కలపై చిందులు వేస్తూ తీయదనాలు చిలికే పలుకు బళ్ళనూ, సుతారపు నుడికారపు సొంపులనూ చూచి చూచి కాదనటానికి మనసొప్పక స్వస్థాన వేష భాషా ప్రియులైన మన కవులు కొందరు వాటిని రతనాలు మాదిరిగా ఏరి చికిలివేసి, చిత్రికపట్టి, రచనలలో జవకట్టి తమ ప్రయోగపద్ధతిగా జిలుగు నగిషీలు చెక్కారు. తిక్కన, సోమన, శ్రీనాథ పెద్దనాది మహాకవులు ఈ ప్రలోభానికీ, ఈ ప్రలాభానికీ లోనైన మాననీయులే. "అప్పాచెల్లెండ్రు" "ఇరవై యెన్మిది మూళ్ళమేర", "నమ్మినమ్మక' ', "నెలరెణ్ణెల్లకు", "మూన్నాళ్ళు", "చేసిందేమిటి", "రోసిందేమిటి", "వస్తూ చూస్తిమి" వంటి /వ్యావహారిక ప్రయోగాలను కోకొల్లలుగా కొసరికొసరి ధృతిమంతులూ, శ్రుతవంతులూ ఐన ప్రామాణిక కవులు తమ చతుర వచో విలాసంలో పదంబడిగా ప్రయోగించారు".

-- ఆ మహాకవులే "నమ్మినమ్మక" అన్న ప్రయోగం చేశారు. నన్నయ గారి "అస్పృశ్య" కి సమానార్థకంగా నేను "కనిపించే కనపడనట్లు" అని రాశాను.

సి) "ఇంతంత" ఎందుకు? ఇంత సరిపోదా? బి.యన్.

ఎ) C.P. Brown నిఘంటువు, 132 వ పనేజీలో '('ఇంతంత' ' ప్రయోగానికిచ్చిన ఉదాహరణలు : వాడు పడ్డ ప్రయాస ఇంతంత కాదు ఇంతంత దొంగగాడు.

2) అర్థ పరిణామం - జి.యన్. రెడ్డి వ్యాసం, "తెలుగు భాషా చరిత్ర" భద్రిరాజు కృష్ణమూర్తి

ఆమ్రేడిత రూపాలు (Reduplications) ఒక పదాన్ని అవ్యవహితంగా పునరుక్తి చేసినందువల్ల విశిష్టార్థం సిద్ధించవచ్చు. ఉదా : "ప్రతి" అనే అర్థంలో ఊరూరు, ఇల్లిల్లు, వాడ వాడ, వీధి వీధి, మొ॥ వచ్చి చూసి చూసి ఎగిరెగిరి, ఇటువంటి కార్త్యర్థక్రామ్రేడిత రూపాలు; ముక్కలు ముక్కలు, పాడిపాడి మొ॥గు పునరుక్తి రూపాలు విశిష్టార్థంలో ప్రయోగించవచ్చు".

12. "టచ్, స్టైస్" అనివార్యమా? ఇంగ్లీషు పదాలు నిషిద్ధం అని నా అభిప్రాయం కాదు. బి.యన్.

.... అనివార్యం కాదు, అలవాటుగా దొర్లిన బి.యన్. గారి వ్యాసంలో ఇంగ్లీషు పదాలు, ఇంగ్లీషు భాషా శాస్త్రవేత్తలు (ఆంగ్లంబదులుగా) ఎలా దొర్లాయో అలా. యూనివర్శిటీ సిద్ధాంతవ్యాసాల్లో సైతం నుమతిస్తునపుడు,ఈ వ్యాసాల్లో అవి పెద్ద అపరాధాలు కావు.

13. "అయినా" కన్న "ఐనా" బావుంటుంది. "అయినా" ప్రయోగం సరైంది కాదు - బి.యస్

- దీనికన్నా ఇది బావుందని చెప్తే పర్లేదు అసలీ ప్రయోగమో సరైందికాదట. "నావ మాత్రంగానయినా" - అన్న పదంనుండి "అయినా' ని విడదీసి చూపారు బి.యన్.గారు "తక్కువ అక్షరాలున్న ఆంగ్ల భాష భాషాప్రయోజనాన్ని సమర్థవంతంగా నెరువేరుస్తుండగా, మనమెందుకు ఇన్ని అక్షరాలు నేర్చుకునే భారం పిల్లలనెత్తినేయాలని" వ్యవహారిక భాషావాదుల చేసిన వాదనల ఫలితంగా "ఋ, ౠ, ) ౘ,ౙ ఱ " లాంటి అక్షరాలు తెలుగు వర్ణమాలనుండి తొలగిపోయాయి. క్ష, ఐ, ఔ, ల మీద కూడా ఇలాంటి వివాదమే జరుగుతుండెంతో కాలంగా, వృద్ధక్షరాల బదులు కూడా అచ్చులు (ఐదు = అయిదు) ఐసు = అయిసు, ఔను అవును) వాడటం ఈ వాస తర్వాత మొదలయింది. దీనివలన మరో రెండక్షరాల్ని నేర్చు కునే భారం, గుణింతాల్లో కూడా ఇత్వం, ఔత్వంల స్థానంలో అఇన, అవువాడితే మరాకొంత భారం తగ్గుతుందన్న వాదన బయలుదేరాక - ఆ ప్రయోగాలు విరివిగా జరిగి ఆమోదం పొందాయి. పై పదంలో "నామమాత్రంగా గానయినా" అని నేనురాసిన చోట న్ + అయి = నై ప్రయోగమే చేశాను. ఇది భాషాశాస్త్రవేత్తలంగీకరించిన ప్రయోగం.

14. "వీటిని గురించి లోతుగా తెలియని కాలంలో ఒక ఘటన ఇంకొక ఘటనని గ్రుడ్డిగా ప్రభావితం చేస్తుందనీ, మరి కొన్ని ఘటనలు ఆ తర్వాత చెడచేస్తాయనీ నమ్మటం మొదలు పెట్టారు. వీటినే మంచి శకునాలు, అపశకునాలు అని పిల్చారు"

అని నేను రాసిన వాక్యాలో

ఎ) మొదలు పెట్టారు, పిల్చారు, వచ్చారు క్రియలకు కర్త ఎవరు? - బి.యన్.

"ఆధునిక భాష - సంగ్రహవర్ణనం - చేకూరి రామారావు 384 పేజి నుండి 387 పేజీ లో వాక్య నిర్మాణం గురించిన వివరణ ఉంది.

వాక్యనిర్మాణం, సామాన్య వాక్యాలు, సంక్లిష్ట వాక్యాలు, సంయుక్త వాక్యాలు, క్రియారహితవాక్యాలు , క్రియాసహిత వాక్యాలు కర్తృరహిత వాక్యాలు, కర్తృసహిత వాక్యాలు.

కర్తృరహిత వాక్యాల్లో "ఉంది / ఉన్నారు"లాంటి క్రియారూపం ఉంటుంది. ప్రత్యయం ఉంటుంది. కర్తృరహిత వాక్యాల్లో క్రియారూపంలోనే కర్త ఉంఉటంది. ఈ ఉదాహరణలో పిల్చారు, వచ్చారు, మొదలుపెట్టారు అనే క్రియా రూపాల్లో కర్తలుగా "జనం" ఉన్నారు.

బి) "శకునాలు" ఘటనలు కాదు. సూచికలు - బి.యన్.

- ముందు ఈ సమాజాన్ని, ప్రకృతిని "ఉన్నదున్నట్లు"గా చూడటం శాస్త్రీయ దృక్పథం. పిల్లి ఎదురవటం, ఎడమ కన్ను అదరటం, బల్లి పడటం - ఇవన్నీ ఘటనలే! ఒక Period of time లో జరిగే వాటిని ఘటనలు / సంఘటనలు అంటారు.

- కొన్ని ఘటనలు మంచిని సూచిస్తాయనీ, కొన్ని ఘటనలు చెడును సూచిస్తాయనీ శాస్త్రజ్ఞానం సరిగ్గా లేని రోజుల్లో ప్రజలు నమ్మారనవచ్చుకదా! బి.యన్.

- అనకూడదు! శాస్త్రజ్ఞానం సరిగ్గా లేని రోజుల్లో కాదు. శాస్త్రజ్ఞానం ఎంతో పెరిగిన ఈ రోజుల్లో మాత్రం నమ్మటం లేదా? ఆ నమ్మకం భూతకాలంలోనూ ఉంది, వర్తమానంలోనూ ఉంది. అప్పట్లో నమ్మారని రాస్తే ఇప్పుడు మానారనే అర్థం వస్తుంది. ఆ యా ఘటనలకి సూచనగా ఏదో ఒక నమ్మకాన్ని మంచనో, చెడనో నమ్మకాన్ని జనం ఆపాదించుకున్నంత మాత్రాన అవి "ఘటనలు" కాకుండాపోయి "సూచికలు" మాత్రమే అవవు. వస్తావంలో అది ఘటనే! నమ్మే వ్యక్తి నమ్మకంలోనే అది సూచిక.

ఏదైమైనప్పటికీ బి.యన్.గారు ఓ ఆరోగ్యవంతమైన చర్చకి నాంది పలికారు. తద్వారా ఎంతో నేర్చుకునే అవకాశం నాకు కల్పించారు. విమర్శ అభివృద్ధికి ఏనాడూ రాచబాటే!

# SRI Y.N. COLLEGE

NARSAPUR -W. G.Dt.

Estd. 1949




## COURSES OFFERED

**P.G.LEVEL 1)M.A.(ENGLISH) 2 M.A.(PUBLIC ADMINISTRATION)**
**3. M.Com., 4. M.B.A., 5. M.C.A.**

B.Sc. :
1. Maths, Physics and Computer Science
2. Maths, Physics and Electronics
3. Maths, Physics and Chemistry
4. Botany, Zoology and Chemistry
5. Zoology, Fisheries and Chemistry

B.A. :
1. History, Economics and Politics
2. Public Administration, Histroy and Geography
3. Economics, Histroy and Industrial Relations
4. Special English, Histroy and Politics

B.Com.:
1. Telugu Medium
2. English Medium

Inter :
1. M.P.C. 2. Bi.P.C. 3. H.E.C.
4. C.E.c 5. H.E.G. 6. M.E.C.

Inter
Vocational 1. EDAR 2. Radio & T.V. 3. Computer Science

| | | |
|---|---|---|
| **Dr.N.Chinta Rao** | **Bh.Jinendranath** | **Dr.C.Satyanarayana Rao** |
| P.G.Director | Principal | Secretary & Correspondent |

# "మానవ జీవితములో గణిత శాస్త్ర పాత్ర"

- కె.వి. భూపతి నాయుడు

"A poor teacher tells,
An average teacher explains
A good teacher demonstrates,
The great teacher inspires" అన్నారు.

"ఒక దేశము యొక్క ఘనత ఆదేశ పౌరుల యోగ్యతపై ఆధారపడి ఉంటుంది. యోగ్యత చాలా మటుకు వారు పొందిన విద్య యొక్క ఆ పేరుల నాణ్యతపై ఆధారపడి ఉంటుంది. మరి వారు పొందే విద్య యొక్క నాణ్యత ఒకే ఒక్క కారణముపై ఆధారపడి ఉంటుంది. అదే వారి ఉపాధ్యాయుల శ్రేష్ఠత" ఆ శ్రేష్ఠత వారు బోధించే విషయాలలో ముఖ్యముగా గణితముపై చాలా ప్రభావము కల్గి ఉంది.

అందుకే 3 R's లో Readng, writing తరువాత స్థానము గణితములోనొక భాగమైన Arithmatic కు ప్రాధాన్యత నిచ్చారు. అమ్మ ఒడిలోంచి, అంతరిక్షం బడిలోకి ఎదిగిన మనిషి, తనను తాను తెలుసుకోవాలన్న, విశాల విశ్వాంతరాళపు రహస్యాలు ఆకళింపు చేసుకోవాలన్నా ఏం కావాలి ? అని ప్రశ్నిస్తే 'మేధకుడైన మనిషి లెక్కలు తెలుసుకోవాలి' అని జవాబు వస్తుంది.

గణిత శాస్త్రానికి విశ్వ శాస్త్ర ప్రతిపత్తి ఉంది. 1 నుంచి 9 వరకు అంకెలయితే, 10 సంఖ్య అయింది. అక్కణ్ణుంచి కూడికలు, తీసివేతలు, గుణకారాలు, భాగహారాలు, ఒకట్లు, పదులు, వందలు, వేలు, లక్షలు ఇలా లెక్కలు ఎదిగి, ఎదిగి విశ్వరూపం ప్రదర్శిస్తాయి.

మనిషి దూరాన్ని కొలిచేది అంకెలలో, రాకెట్ వేగాన్ని కొలిచేది అంకెలలో, గుండె స్పందన, మెదడు ఆలోచనని కొలిచేది అంకెలలో, రేడియో ధార్మిక శక్తి పాతాన్ని అంచనా వేసేది అంకెలలో.

చీమ నుంచి బ్రహ్మాండం వరకు విస్తరించిన జీవ, నిర్జీవ పదార్థాల చలనాచలనాలని, స్థితిగతులని తెలిపేది అంకెలే. అందుకే శ్రీనివాస రామానుజన్ లెక్కల ద్వారా సత్యాన్ని తెలుసుకొంటానని అన్నాడు. జీవితాన్ని అర్పించాడు.

ఋగ్వేదం నుంచి రామానుజన్ వరకు సులభ సూత్రాల నుంచి శకుంతలాదేవి వరకు భారతీయ గణితశాస్త్రంలో ఎన్ని ఛమక్కులో! ఎన్ని చమత్కారాలో!

సంస్కృతమున 'గణ్' అనగా లెక్కించుట అని అర్థము. కావుననే గణితము అనగా 'లెక్క' అని చెప్పుకొనుచున్నాము. మానవులకు లెక్కించవలసిన అవసరము ఎంతేని కలదు. నిత్యజీవిత మందుగాని, వృత్తికి సంబంధించిన వ్యవహారములలో కాని గణించవలసిన అవసరము లేకుండా ఏ వ్యక్తి క్షణకాలమైననూ గడపలేడు. అంటే మానవ జీవితము, గణితముతో ముడి పడియున్నదని నిస్సందేహముగా చెప్ప వచ్చును. మిగిలిన సబ్జక్టులు అన్నిటి కంటే గణితశాస్త్రము విద్యార్థులలో భావిజీవితమునకు అవసరమైన "ఆలోచనాశక్తి"ని పెంపొందింప గల్గుతున్నదను విషయము స్పష్టమగుచున్నది.

పూర్వకాలములో విద్యాభ్యాసము, సమాజములోని కొన్ని వర్గముల వారికే పరిమితమై యుండెడిది. నాటి విద్య యందు గణితమును బోధించుట తప్పని సరి. 'ప్లేటో కరకులమ్'లో గణితమును సూచించు కారణమేమనగా 'గణిత వివేచన మేధస్సుకు శిక్షణ ఇస్తే, వారికి వేరే ఏ ఉపయోగం ఉన్నా, లేకపోయినా వారు చాలా చురుకుగా తయారవుతారు." అని నిస్సందేహముగా చెప్పవచ్చును. ప్రాచీన ఈజిప్టులో ప్రతిసంవత్సరము వచ్చుచుండెడి వరదల వల్ల పొలము హద్దులు కొట్టుకొని పోయెడివి. వాటి హద్దులను తిరిగి నెలకొల్పు అవసరము వలన రేఖాగణితము రూపొందినది. అందువలననే "మానవుడు భూమిని కొలుచు అవసరమేర్పడుట వలన రేఖాగణితము రూపొందినది".

మానవ నాగరికత నిర్మింపబడుటలో గణితము ప్రాధాన్యమైన పాత్రను నిర్వహించుచున్నది. అట్లు చేయుటలోనే, ఆధునిక ప్రపంచము నిల్వగల్గుటకు, అభివృద్ధిని సాధించుటకు గణితము తప్పనిసరియను స్థితిని కల్పించినది. నేటి ప్రపంచములో మనము సెకనులో భాగమునకు కూడా చాల ఖచ్చితముగ నుండవలసి వచ్చుచున్నది. దీనికొరకు గణిత శాస్త్రపు అవగాహన, గణన చేయగల్గుట ముఖ్యము. ఉదా॥కు 1984 సం॥లో లాస్ ఏంజిల్సులో జరిగిన ఒలంపిక్స్ క్రీడలలో మనదేశమునకు చెందిన పి.టి. ఉష సెకనులో నూరవ వంతు తేడాలో బంగారు పతకమును పోగొట్టుకున్నది.

రోదసీలోకి పంపబడుతున్న రాకెట్ల ప్రయోగ సమయము, ఎంత కోణములో దానిని ప్రయోగించవలెను, భూమికి దింపవలెను, ప్రయోగించుటకు ఎంత శక్తి అవసరము మున్నగు వాటికి ఉన్నత స్థాయి గణితశాస్త్రము పై ఆధారపడవలసినదే.

నేడు ప్రతి పనికి యంత్రములపై ఆధారపడుచున్నాము. దాని వలన ఆపని చాలా ఖచ్చితముగను, త్వరితముగను జరుగును. కంప్యూటర్ల ఉపయోగము పెరిగినది. కంప్యూటర్ల కొరకు గణితశాస్త్రజ్ఞులు దశాంశ పద్ధతినేగాక, ఇతర సంఖ్యా మానములను కనిపెట్టిరి. సుమారు వంద సంవత్సరముల క్రితము 'విలియమ్ షేంక్సు' అను ఆంగ్లేయుడు కలము, కాగితముల సహాయమున 20 సంవత్సరములు శ్రమించి "పై" విలువను 707 దశాంశ స్థానముల వరకు కనుగొన్నాడు. 1950లో ఒక కంప్యూటరు 13 నిమిషములలో 3,000 దశాంశముల వరకు "పై" విలువను కనుగొన్నది. దీనిని బట్టి యంత్రముల ఉపయోగము వలన ఎంత కాలమును మనము ఆదా చేసుకొనవచ్చునో గ్రహింపవచ్చును.

వర్తమాన సాంఘిక సమాజములో సామాన్య మానవుడికి సైతము గణితము అత్యంత ఆవశ్యకము. పన్నులు, ఇన్సూరెన్సు, ప్రీమియములు, పొదుపు చేయుట, వడ్డీలు, అద్దెలు, ఖరీదు చేయుట మొదలైన నిత్యజీవిత వ్యవహారములలో గణితశాస్త్ర పరిజ్ఞానమెంత అవసరమో ప్రతి ఒక్కరికీ తెలుసు.

ప్రపంచ వాణిజ్య వ్యవస్థకు ఆధారమైనది గణితమే అనుడి నిర్వివాదము. గణితము ప్రముఖస్థానము వహించని విజ్ఞాన శాస్త్రముకాని, కళగాని, వృత్తిగానిలేదు. ఒక విజ్ఞాన శాస్త్రపు కచ్చితత్వము, ఆ శాస్త్రమందు వినియోగింపబడిన గణితముపై ఆధారపడి యుండును. —సూజక

శాస్త్రములైనట్టి మనస్తత్వ శాస్త్రము, ఆర్థిక శాస్త్రము, భూగోళ శాస్త్రము మున్నగునవి కూడ గణితమును విస్తారముగా ఉపయోగించుకొనుచున్నవి. డేమ్‌లు, బ్రిడ్జీలు, ఇతర కట్టడములందు నౌకా, విమాన నిర్మాణములందు గణిత సంబంధ గణనలుండి తీరవలసిందే. కంపెనీలు తమ ఉత్పత్తులు వార్షికముగ ఎట్లు అభివృద్ధి చెందుచున్నవో, వాటి వలన తమ లాభములు ఎట్లు అభివృద్ధి చెందుచున్నవో తెలియజేయుటకు ప్రకటనలు చేయుచుందురు. అందు కొఱకు రేఖా చిత్రములను ఉపయోగింతురు. ప్రభుత్వ బడ్జెట్‌ను తయారు చేసినప్పుడు, ప్రభుత్వ ఆదాయ వ్యయములను ఒక్క రూపాయిగా తీసికొని వానిని 'పై' చిత్రము ద్వారా సూచింతురు.

శరీర ఉష్ణోగ్రత, రక్తపోటులను కొలుచుటకు నాడి కొట్టుకొనుటను తెలుసుకొనుటకు ఔషధమును ఎన్ని పర్యాయములు వాడవలెను. మున్నగు విషయములలో వైద్యులు సహితము గణితమును వాడి తీరవలసినదే. నిత్య జీవిత వ్యవహారములలోగాని, వృత్తి సంబంధిత వ్యవహారములలోగాని గణిత వినియోగము లేకుండ ఏ ఒక్కరునూ జీవితమును గడుపలేరు.

ఒక్క వాక్యములో చెప్పవలెనంటే గనితముతో ముడి పడకుండ ఉండని అంశమేదియు మానవ జీవితములో లేదు.

ఇతర సబ్జక్టులతో గణితమునకు గల సహ సంబంధము :

1. గణితము - భాషలు : ఏ భాషాభ్యాసమునకైనను మూలము దాని వ్యాకరణము. వ్యాకరణములో మనము కొన్ని నియములను, సూత్రములను ఉపయోగించెదము. అవి అన్నియు గణిత పరిధికి లోబడినవే. పద్యపాదము యొక్క గణ విభజన, యతిప్రాసల నిర్ణయములు మొదలగునవి. గణితము తనదైన ఒక ప్రత్యేకమైన భాషను కల్గి యున్నది. అది సంఖ్యలు, సంజ్ఞలు, గుర్తులు, సూత్రములు, సమీకరణములు రూపములో నున్నది.

2. గణితము - భౌతిక శాస్త్రము : 'వైట్' మహాశయుని మాటలలో చెప్పాలంటే చిత్రకారుడు లేక శిల్పి వెనుక ఒక రసాయనిక శాస్త్రవేత్త అతని వెనుక ఒక భౌతిక శాస్త్రవేత్త, అతని వెనుక ఒక గణిత శాస్త్రవేత్త కలడు. భౌతిక శాస్త్రాధ్యనములో ఏ అంశమైనను గణిత పరిజ్ఞానముతో జరుగవలసినదే. కాంతి పాఠ్యాంశమందలి ముఖ్యసూత్ర నిరూపణకు రేఖాగణిత పరిజ్ఞానము ఎంతైనా అవసరము.

3. గణితము - రసాయన శాస్త్రము : వివిధ మూలకముల లక్షణములు, నిర్మాణమును, గణిత పరిజ్ఞానము వలననే అవగాహన చేసికొనగలము. రసాయన శాస్త్రములో సమీకరణములను తుల్యమొనర్చుట, బీజ గణిత సమీకరణములను పోలి యుండును. పీరియాడిక్ పట్టికలో మూలకముల అమరిక గణితాధారముగా చేయబడినదే.

4. గణితము - జీవశాస్త్రము : బయోఫిజిక్సు, బయో కెమిస్ట్రీలు రెండు ఇంచు మించుగా స్వతంత్ర శాస్త్రములుగా అభివృద్ధి గాంచినవి. ఈ రెంటిపైననే జీవశాస్త్ర అధ్యయనము చాలా మటుకు ఆధారపడి యున్నది. అందువలన జీవశాస్త్రజ్ఞుడు తప్పని సరిగా గణితమును నేర్వవలసినదే. మానవ శరీరము యొక్క అవయవ సౌష్ఠవము నిక్కచ్చిగ గణితముపై ఆధారపడినదే. మానవుని ఎత్తు అతని పాదము యొక్క కొలతకు ఆరు రెట్లుండును. మానవుని చేతి మణికట్టు నుండి నడిమివేలు వరకు గల కొలత మొత్తము ఎత్తులో పదవ వంతు ఉండును.

5. గణితము - సాంఘిక శాస్త్రము : భూమి యొక్క కొలతలు, సూర్య చంద్ర గ్రహణములు, దివారాత్రము లేర్పడుట, వర్షపాతము, జనసాంద్రత ఇట్టి అనేక పాఠ్యాంశములకు గణిత విషయమ జ్ఞానము అవసరము. దేశ పటములను సరియైన కొలతలతో గీయుట, వానిని అవగాహన చేసికొనుటకు గణిత మావశ్యకము. "చరిత్ర అనిన గతించిన సంఘటనల క్రమబద్ధమైన అధ్యయనమే'. దీనిని వ్యాఖ్యానించుటకు, ఖచ్చితముగ వర్ణించుటకు గణిత పరిజ్ఞానము తప్పని సరి.

6. గణితము - వ్యాయామ విద్య : వ్యాయామ విద్యలో శరీర నిర్మాణ శాస్త్రము నభ్యసించవలెను. శరీర సంవిధానముల గూర్చిన జ్ఞానమునకు గణితశాస్త్ర సంబంధమైన లెక్కించుటలు తప్పని సరి. వరుసలలో నిలుచుట వలన సమాంతర రేఖల భావనను బోధించవచ్చును. టెన్నిస్, షటిల్ బాడ్ మింటన్ మున్నగు క్రీడలలో గెలుపు సాధించుటకు కోణముల గూర్చిన పరిజ్ఞానము ఎంతైనా అవసరము.

7. గణితము - లలిత కళలు : చిత్రమునుగాని, నమూనాను గీయుటకు రేఖాగణిత సంబంధమైన ఆకారముల జ్ఞానము, అంకగణిత మాపనము గనించుటలో నైపుణ్యము మిక్కిలి అవసరము. ఈజిప్టు పిరమిడ్ల నిర్మాణము గణిత శాస్త్ర నియమములతో కూడినదే. సంగీత బాణీల నిర్మాణమున గణిత శాస్త్రపు పాత్ర గణనీయమైనది.

"ఎచట లయ కలదో, అచట సంఖ్య కలదు" - పైథాగొరస్.

"నిగూఢమయిన అంకగణితా భ్యాసమే సంగీతము. అది సంఖ్యలతో సంబంధం కల్గి ఉన్నది" - లెబ్నిడ్జ్

విద్యార్థులకు మనోరంజక వ్యాసక్తులగు మేజిక్ స్క్వేరులు, గేమ్సు, పజిల్స్ ద్వారా గణితము ఆహ్లాదమును కల్గించును. వాటిలో ఉదాహరణకు కొన్ని -

1. $9 \times 9 + 7 = 88$
   $98 \times 9 + 6 = 888$
   $987 \times 9 + 5 = 8888$
   $9876 \times 9 + 4 = 88888$

2. $1 \times 9 + 2 = 11$
   $12 \times 9 + 3 = 111$
   $123 \times 9 + 4 = 1111$
   $1234 \times 9 + 5 = 11111$

3. $12345679 \times 9 = 111111111$
   $12345679 \times 18 = 222222222$
   $12345679 \times 27 = 333333333$
   $12345679 \times 36 = 444444444$

4. 4 నాల్గులతో చతుర్విధ ప్రక్రియలైన +, -, ×, ÷ లతో 1, 2, 3, . . . ను రాబట్టుట. మొదలగునవి.

గణిత శాస్త్ర బోధన వలన విద్యార్థులలో విద్యా విలువలను పెంపొందింపచ్చును. అవి 1. ప్రయోజన విలువ, 2. నైతిక విలువ, 3. కళాత్మక విలువ, 4. క్రమశిక్షణా విలువ, 5. సాంస్కృతిక విలువ, 6. సాంఘిక విలువ, 7. మేధా సంబంధిత విలువ.

ఈసందర్భముగ ప్రఖ్యాత భారతీయ గణిత శాస్త్రజ్ఞుల పేర్లు కొన్నింటిని తెలుసుకొందాం.

1. శ్రీనివాస రామానుజన్, 2. ఆర్యభట్టు, 3. లీలావతి, 4. శ్రీమతి శకుంతలాదేవి, 5. సంజీవరాయశర్మ లక్కోజు మొదలగు వారు.

విద్యా వ్యవస్థలోనేగాక మానవ జీవితంలో కూడ ఇంత ప్రాముఖ్యతను సంతరించుకొన్న గణిత శాస్త్రమును బోధించుటలో ప్రతి ఉపాధ్యాయుడు తన్నుతాను వృత్తిపరంగా అభివృద్ధి చేసుకొని విద్యార్థుల సంక్షేమము కొరకు, తద్వారా సంఘ, దేశ సంక్షేమముల కొరకు పాటు పడవలసిన ఆవశ్యకత ఎంతైన కలదు.

# యు.టి.యఫ్. జిల్లాశాఖల నూతన కౌన్సిల్ సమావేశాలు

## చరిత్రాత్మకమైన మంగళం పేట కౌన్సిల్

చిత్తూరు జిల్లా నూతన కౌన్సిల్ సమావేశం ఏప్రిల్ 16,17 తేదీలలో పులిచెర్ల మండలంలోని మంగళంపేటలో జరిగింది. జిల్లా అధ్యక్షులు శ్రీ K.. రామచంద్రారెడ్డి అధ్యక్షతన జరిగిన సమావేశానికి రాష్ట్ర అధ్యక్షులు శ్రీ. D రామిరెడ్డి పాల్గొన్నారు.

జిల్లా ప్రధాన కార్యదర్శి శ్రీ. S ఆనందనాయుడు ప్రవేశపెట్టిన కార్యదర్శి నివేదికలో సంఘనిర్మాణం, సంఘం చేపట్టిన ఉద్యమాలు వివరింపబడినవి. జిల్లాలోని ఉపాధ్యాయకు వర్గం యు. టి. యఫ్. ఉద్యమాల పట్ల ఆకర్షితులై వున్నారని వారి ఆశలు నెరవేర్చాలంటే నిర్మాణం మరింత మెరుగు పరచుకోవాలని నిర్మాణనివేదికలో పేర్కొన్నారు. జిల్లా కేంద్రం సమర్థవంతంగా పని చేయుడానికి గాను సమిష్ఠి తత్వాన్ని అభివృద్ధి చేసికోవాలనీ, ఆర్థిక వసరులను అవసరాలకనుగుణంగా సమీకరించుకోవాలని, ఈకౌన్సిల్ అభిప్రాయపడింది. శ్రీ.D రామిరెడ్డి గారు సందేశమిస్తూ అవినీతికి వ్యతిరేకంగా నిలిచి ఫిక్సేషన్లు చేయించిన మండలాలను, టీచర్లను అభినందించారు. అవినీతికి వ్యతిరేకంగా నిలవడం అనేది ఉపాధ్యాయ వర అభివృద్ధిలో భాగమని ఎన్ని ఇబ్బందులు ఎదురైనా రాజీలేని పోరాటం చేయాలని సందేశమిచ్చారు. 47 శాతము నుండి హాజరైన ప్రతినిధులు తమ శాతము రిపోర్టులను ఇచ్చారు.

అనంతరం ఏకగ్రీవంగా ఎన్నికలు నిర్వహింపబడినవి.

అధ్యక్షులు: K.రామచంద్రారెడ్డి, అసోసియేటెడ్ అధ్యక్షులు M.. జయరామనాయుడు, ప్రధానకార్యాదర్శి S..ఆనందనాయుడు, కార్యదర్శులు T. క్రిష్ణమనాయుడు,V.. చంద్రారెడ్డి, M.. గోపాల్, M.. దొరస్వామినాయుడు, E.. ఈశ్వరరెడ్డి, P. దొరస్వామి, T. గోపాల్, M. మధుసూదన రెడ్డి, S. క్రిష్ణమూర్తి,Y.. సోమశేఖర రెడ్డి, Y. శ్రీనివాసులు రెడ్డి.

రాష్ట్రకౌన్సిలర్లు K. రామచంద్రారెడ్డి..S. ఆనందనాయుడు, K. తిర్మగంపెళ్ళై, S. ఏరాస్వామి, K. మునిరామిరెడ్డి,C.V. సుగుణ.

ఆడిట్‌కమిటి కె. అప్పాజీ (కన్వీనరు), A.G. యతిరాజులు, A. రెడ్డెప్పరెడ్డి.

## విద్యాగోష్ఠి

నూతన కౌన్సిలులో భాగంగా 17వ తేది విద్యాగోష్ఠి జరిగింది. శ్రీ.యస్. ఆనందనాయుడు అధ్యక్షత వహించగా శ్రీ. యమ్. ప్రభాకరరెడ్డి, డి.ఇ.ఓ గారు ప్రారంభించారు. వారు మాట్లాడుతూ సామాజిక స్పృహ కలిగిన ఉపాధ్యాయుడు బోధనలోకూడ న్యాయంచేయగలరన్నారు. మారుతున్న పరిస్థితుల కనుగుణంగా బోధనా సామర్థ్యం పెంచుకోవాలి అన్నారు.

శ్రీ డి. రామిరెడ్డిగారు నూతన ఆర్థిక విధానాలు - విద్యారంగంపై ప్రభావం అనే అంశంపై ప్రసంగించారు. ప్రభుత్వరంగాన్ని విస్మరించేవిధానంలో భాగంగా విద్యారంగాన్ని కూడ నిర్లక్ష్యం చేయడం జరుగుతున్న దన్నారు. ఈ విధానం వల్ల ప్రభుత్వ పాఠశాలలు మూతపడే పరిస్థితులు ఏర్పడుతున్నాయన్నారు. అందరికీ విద్యసాధించాలంటే విద్యారంగం ప్రభుత్వరంగం పరిధిలోనే వుండాలన్నారు.

శ్రీ. యన్. పద్మనాభయ్య, రీడర్, యస్. వి. యూనివర్శిటీ, చిత్తూరు జిల్లాలో విద్యాభివృద్ధి అనే అంశంపై ప్రసంగించారు. యస్.వి. యూనివర్శిటీ చిత్తూరు జిల్లాలో వుండడం వల్ల జిల్లాలో చదువుకున్న వారి సంఖ్య పెరిగిందని, విద్యాసంస్థలు అందుబాటులో వున్నప్పుడే విద్యఅందరికీ లభిస్తుందన్నారు. విద్యారంగం బాద్యత ప్రభుత్వమే భరించాలన్నారు.

శ్రీ. యమ్. రామచంద్రయ్య, అసిస్టెంట్‌డైరెక్టరు, టెక్నికల్ ఎడ్యుకేషన్, కులమతాలు శాస్త్రీయావగాహన పైప్రసంగించారు. అభివృద్ధి - ఐక్యతరెండు ఒకదానిపై ఒకటి ఆధారపడిన పని అన్నారు. సమస్య పరిష్కారానికి కులమతాలు ప్రతిబంధకం కారాదన్నారు.

పులిచెర్ల మండల అభివృద్ధి అధికారి శ్రీ దామోదరరెడ్డి, ఎం.ఇ.ఓ శ్రీ సురేష్ సందేశాలిచ్చారు.

విద్యాగోష్ఠికి హాజరైన 500 మందికి పులిచెర్ల మండలశాఖ భోజనం ఏర్పాట్లు చేశారు.

## ఉపాధ్యాయ పోస్టులను నింపాలి

యు.టి.యఫ్. శ్రీకాకుళం జిల్లాశాఖ డిమాండ్

ప్రభుత్వం ప్రస్తుతం అనుసరిస్తున్న సరళీకృత ఆర్థికవిధానాలలో భాగంగా పబ్లిక్ రంగసంస్థలు ప్రైవేటుపరమవుతున్న నేపధ్యంలో విద్యారంగం మరీ నిర్లక్ష్యానికి గురవుతున్నదని యు.టి.యఫ్. రాష్ట్రప్రధాన కార్యదర్శి శ్రీ ఎ. వెంకటస్వామి శ్రీకాకుళం జిల్లా నూతన కౌన్సిల్ సమావేశంలో ప్రసంగిస్తూ చెప్పారు.

యు.టి.యఫ్. శ్రీకాకుళం జిల్లా శాఖ నూతన కౌన్సిల్ సమావేశం 30.4.94న టౌన్ హాలులో జిల్లాశాఖ అధ్యక్షులు శ్రీ పి. మహేశ్వరరావు అధ్యక్షతన జరిగింది.

జిల్లాశాఖ ప్రధానకార్యదర్శి శ్రీ బొడ్డేపల్లి మోహనరావు ప్రవేశపెట్టిన కార్యదర్శినివేదికపై జరిగిన చర్చలలో పలువురు పాల్గొని విలువైన సూచనలు చేశారు. జిల్లాలోని 21 మండలాల నుంచి 80 మంది కౌన్సిలర్లు కార్యకర్తలు హాజరయ్యారు. జిల్లాలోని ఉపాధ్యాయుల సమస్యలను, విద్యాప్రమాణాల పెరుగుదలకు అవసరమైన చర్యలను గురించి కౌన్సిల్ చర్చించింది. కార్యదర్శి నివేదికను కౌన్సిల్ ఏకగ్రీవంగా ఆమోదించింది.

ఖాళీ ఉపాధ్యాయపోస్టులను నింపాలని, ప్రభుత్వంతో కుదిరిన ఒప్పందాన్ని అమలుచేయాలని, కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులతో సమానంగా డి ఎ. ప్రకటించాలని ప్రభుత్వాన్ని డిమాండ్‌చేస్తూ కౌన్సిల్ తీర్మానించింది. వృత్తివిద్యాబోధకులకు టైం స్కేలు యివ్వాలని, కంటింజెన్సీ నిధులను విడుదలచేయాలని, సీనియారిటీ జాబితాలను సక్రమంగా తయారుచేసి ప్రమోషన్స్ యివ్వాలని కంటింజెన్సీ నిధులను విడుదలచేయాలని, యల్‌టి. సి. అరియర్లను చెల్లించాలని, మరికొన్ని తీర్మానాలను కౌన్సిల్ ఆమోదించింది.

అనంతరం శ్రీ వెంకటస్వామి నిర్వహించిన ఎన్నికలలో ఈక్రింది కార్యదర్శివర్గం ఏకగ్రీవంగా ఎన్నుకొనబడింది.

అధ్యక్షులు శ్రీ పి. మహేశ్వరరావు అసోసియేట్ అధ్యక్షులు శ్రీమతి కె. రామలక్ష్మి ప్రధాన కార్యదర్శి శ్రీబొడ్డేపల్లి మోహనరావు కార్యదర్శులు: శ్రీ పి. కృష్ణమూర్తి, శ్రీ యస్. జానకిరామయ్య, శ్రీ జి. అప్పారావు, శ్రీయస్. అప్పలరాజు

శ్రీ వి.వి. వసంతకుమార్, శ్రీ బి.వి. సూర్యనారాయణ, శ్రీ యం. సన్యాసినాయుడు

శ్రీ బి. వెంకటరావు, శ్రీ జె. నీలయ్య, సామాజిక చైతన్యంతో పురోగమించడం - యు.టి.యఫ్. ఆశయం

అధ్యయనం అధ్యాపనం సామాజిక స్పృహ యు.టి.యఫ్. ఆశయాలని, హక్కులకై పోరాడటానికి ఎంత ప్రాధాన్యత నిస్తుందో బాధ్యతలను నిర్వర్తించడానికి, ఉపాధ్యాయులకు సామాజిక కర్తవ్యాలను తెలియజెప్పి వారిని చైతన్యపరచడానికి యు.టి.యఫ్. అంత ప్రాధాన్యత నిస్తుందని అదిలాబాద్ జిల్లా కౌన్సిల్ సమావేశాన్ని ప్రారంభిస్తూ యు.టి.యఫ్. రాష్ట్రకార్యదర్శి శ్రీ జి. లక్ష్మయ్య చెప్పారు.

యు.టి.యఫ్. ఆదిలాబాద్ జిల్లా కౌన్సిల్ సమావేశం 17-4-94న ఆసిఫాబాద్ ప్రాథమికోన్నత పాఠశాలలో జిల్లాశాఖ అధ్యక్షులు శ్రీ ఆర్. రాజన్న అధ్యక్షతన జరిగింది.

జిల్లాప్రధాన కార్యదర్శి శ్రీ యస్. శశికాంత్ తన రిపోర్టులో జాతీయ అంతర్జాతీయ పరిస్థితులను గత సంవత్సరకాలంలో యు.టి.యఫ్. సాగించిన కృషిని వివరించారు.

నివేదిక ఏకగ్రీవంగా ఆమోదించబడింది అనంతరం రాష్ట్రకార్యదర్శి శ్రీ జి. లక్ష్మయ్య నిర్వహించిన ఎన్నికలలో ఈ క్రింది కార్యదర్శివర్గం ఏకగ్రీవంగా ఎన్నుకొనబడింది.

అధ్యక్షులు శ్రీ కె. దేవేందర్

ప్రధాన కార్యదర్శి శ్రీ యస్. శశికాంత్ అసోసియేట్ అధ్యక్షులు: శ్రీ డి. విఠల్‌రావు

కార్యదర్శులు: శ్రీ పి. మధుకర్, శ్రీ ఆర్. వెంకటయ్య. శ్రీ ఎ. వెంకటరమణమూర్తి, శ్రీ వి. స్వయంప్రకాష్, శ్రీ లక్ష్మీరాజ్యం. శ్రీ పి. నారాయణరెడ్డి, శ్రీ సి. లక్ష్మణరావు, రాష్ట్రకౌన్సిల్ సభ్యులు: శ్రీ యస్. శశికాంత్ శ్రీ కె. దేవేందర్

## ఖమ్మం జిల్లా నూతన కౌన్సిల్ సమావేశం

వివిధ యాజమాన్యాల నిర్వహణలో వున్న పాఠశాలల్లో సంవత్సరాల తరబడి ఖాళీగా వున్న 25వేల ఉపాధ్యాయ పోస్టుల్ని వెంటనే భర్తీ చేయాలని యు.టి.యఫ్. ఖమ్మం జిల్లా నూతన కౌన్సిల్ రాష్ట్ర ప్రభుత్వాన్ని కోరుతూ ఏకగ్రీవంగా తీర్మానించింది. విద్యాప్రమాణాల పెంపుదలకు, నిరుద్యోగ నిర్మూలనకు దోహదం చేసే ఈ చర్యను తీసికొనడంలో కాలయాపన చేయడం పట్ల తీర్మానం నిరసన వ్యక్తం చేసింది.

జిల్లా యు.టి.యఫ్. నూతన కౌన్సిల్ సమావేశాలు రెండురోజులు (మే 30, 31) ఖమ్మంలోని యు.టి.యఫ్. కార్యాలయంలో శ్రీ యన్. నారాయణ అధ్యక్షతన జరిగాయి. మొదటి రోజు సమావేశంలో ప్రధాన కార్యదర్శి శ్రీ కె. కృష్ణయ్య కృషినివేదికను ప్రవేశపెట్టగా కౌన్సిలర్లు చర్చలో పాల్గొని పలు సూచనలు చేసిన మీదట నివేదికను సమావేశం ఆమోదించింది.

యు.టి.యఫ్. రాష్ట్ర అసోసియేట్ అధ్యక్షులు శ్రీ యన్. రామకోటేశ్వరరావు, కార్యదర్శి శ్రీ జి. లక్ష్మయ్య ప్రత్యేక ఆహ్వానితులుగా కౌన్సిల్‌కు విచ్చేసి మారుతున్న పరిస్థితులలో ఉపాధ్యాయుల కర్తవ్యాలను వివరించారు. విద్యారంగ ప్రైవేటీకరణకు పాఠశాలల నిర్వహణను గ్రామ విద్యా కమిటీలకు అప్పగించటానికి రాష్ట్ర ప్రభుత్వం చేస్తున్న ప్రయత్నాలకు వ్యతిరేకంగా ఉద్యమించడంతో పాటుగా ఉపాధ్యాయులు పనిచేస్తున్న గ్రామాలలో నివాసం వుండి ప్రైవేటు పాఠశాలలకు పోటీగా ప్రభుత్వ పాఠశాలల్లో ఎక్కువ ఫలితాలకోసం అంకిత భావంతో కృషిచేయాలని చెప్పారు.

ప్రజాధనం దుర్వినియోగానికి అవినీతికి తావు కల్పిస్తున్న యల్.టి.సి. కి నగదు మంజూరుచేసే ప్రస్తుత పద్ధతి స్థానంలో పాస్‌సిస్టమ్‌ని ప్రవేశపెట్టాలనీ, జాయంట్ స్టాఫ్ కౌన్సిల్‌లో యు.టి.యఫ్ కి శాశ్వత సభ్యత్వం కల్పించాలనీ, ప్రస్తుతం 3 నెలలుగా వున్న ప్రసూతి సెలవును 4 నెలలకు పెంచాలనీ, 1993 పి.ఆర్.సి స్కేళ్లలో అదనపు అర్హతలకు అదనపు ఇంక్రిమెంట్లు కొనసాగించాలనీ, రాష్ట్రప్రభుత్వాన్ని కోరుతూ సమావేశం తీర్మానాలను ఆమోదించింది.

1994-95 సంవత్సరానికి ఈ క్రింది నూతన కార్యదర్శివర్గం ఏకగ్రీవంగా ఎన్నికయింది.

అధ్యక్షులు : శ్రీయన్ నారాయణ, అసోసియేట్ అధ్యక్షులు : శ్రీ యస్. గోపాలరావు, ప్రధాన కార్యదర్శి : శ్రీ కె. కృష్ణయ్య, కార్యదర్శులు : శ్రీ టి. వెంకట్రావు, శ్రీ వి. పరబ్రహ్మ, శ్రీ యం. రామారావు, శ్రీ. జియావుద్దీన్ అహ్మద్, శ్రీ కె. శ్రీనివాసులు, శ్రీ, వి. చెంచిరెడ్డి, శ్రీ సి.హెచ్. రవి, శ్రీ జి. మాధవరావు శ్రీ ఐ. జగపతిరావు, శ్రీ బి. నరసింహారావు, శ్రీ వి. డి.యం.వి ప్రసాద్

రాష్ట్ర కౌన్సిలర్లు : శ్రీ కె. కృష్ణయ్య, శ్రీ యన్. నారాయణ, శ్రీ టి. వెంకటరావు, శ్రీ యస్. గోపాలరావు, శ్రీ యస్.డి. జియావుద్దీన్, శ్రీ కె. శ్రీనివాసులు.

## MAHARISHI VIDYA MANDIR

Srikakulam

Our School, Maharishi Vidya Mandir, was started with 120 students in April 92, with the Co operation of Srikakulam citizens. Now the school has developed with 350 students. (with great efforts of the principal Sri Ch. Narasinga Rao)

Transcendental meditation is compulsary here so that, the students can improve their concentration and creative power. Each class has 25 students so that teachers can take individual care in the calss. Dance and Music teachers were also appointed to encourage extra - curricular activities in children. we will introduce computers shortly. Sanskrit, the vedic language is a special subject here.

# పాఠశాలలో ఖాళీపోస్టులు వెంటనే నింపాలి

## విజయనగరం జిల్లా నూతన కౌన్సిల్

ఉపాధ్యాయుడు విధులయెడల నిబద్ధత కలిగియున్నప్పుడే హక్కుల కొరకు పోరాడగలడని అందుకే యు.టి.యఫ్. హక్కులు బాధ్యతలను రెండునేత్రాలుగా గుర్తిస్తున్నదని యు.టి.యఫ్. రాష్ట్ర ప్రధాన కార్యదర్శి శ్రీ ఎ. వెంకటస్వామి విజయనగరం జిల్లా నూతన కౌన్సిల్ సమావేశంలో ప్రసంగిస్తూ చెప్పారు.

గత సంవత్సరకాలంలో సంఘం సాగించిన కార్యకలాపాల నివేదికను ప్రధాన కార్యదర్శి శ్రీ యం. మురళీధరరావు ప్రవేశపెట్టారు. పలువురు కౌన్సిలర్లు చర్చలలో పాల్గొని నివేదికను పరిపుష్టం చేశారు. నివేదిక ఏకగ్రీవంగా ఆమోదింపబడింది.

రాష్ట్రప్రధాన కార్యదర్శి నిర్వహించిన ఎన్నికలలో ఈ క్రింది నూతన కార్యదర్శి వర్గం ఏకగ్రీవంగా ఎన్నుకొనబడింది.

అధ్యక్షులు శ్రీ ఇ. రామునాయుడు, అసోసియేట్ అధ్యక్షులు : శ్రీ జి. అప్పలనాయుడు, ప్రధాన కార్యదర్శి : శ్రీ యం. మురళీధరరావు, కార్యదర్శులు : శ్రీ సి.హెచ్. సన్యాసులు, శ్రీ పి. తిరుపతిరావు, శ్రీ యల్ ముకుందరావు, శ్రీ యం. యల్. కాంతారావు, శ్రీ యస్. సూర్యనారాయణ శ్రీ.యస్ అప్పలరాజు, శ్రీ కె. రామకృష్ణారావు, శ్రీ యం. సుబ్బరాజు,. శ్రీ ఐ.వి.వి. గోపాలాచారి, శ్రీ యం.యల్. సత్యనారాయణ, శ్రీ యల్. రామకృష్ణారావు.

## కృష్ణాజిల్లా శాఖ నూతన కౌన్సిల్

సంఘానికి నిర్దిష్టమైన లక్ష్యాలు ధ్యేయాలు వుండాలని, వాటిని సాధించేందుకు క్రమశిక్షణాయుతమైన నిర్మాణం అవసరమనీ, అలాంటి పటిష్ఠమైన నిర్మాణ సూత్రాలను పాటించడం వలననే ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ అనతికాలంలోనే రాష్ట్రంలో అత్యంతపెద్ద సంఘంగా ఎదగగలిగిందనీ యు.టి.యఫ్. రాష్ట్రప్రధానకార్యదర్శి శ్రీ ఎ. వెంకటస్వామి కృష్ణా జిల్లా నూతన కౌన్సిల్ సమావేశాన్ని ప్రారంభిస్తూ చెప్పారు. కౌన్సిల్ సమావేశం జిల్లా శాఖ అధ్యక్షులు శ్రీ పి. సోమయ్య అధ్యక్షతన జరిగింది.

జిల్లా శాఖ ప్రధాన కార్యదర్శి శ్రీ పి. వెంకటేశ్వరరావు గత సంవత్సరకాలంలో యు.టి.యఫ్. జిల్లా ప్రజాపరిషత్, డి,ఇ,ఓ.యల్.యఫ్. వివిధ మండలకార్యాలయాల్లో చేసిన ప్రాతినిధ్యాలు సాగించినపోరాటాలు సాధించిన విజయాలకు సంబంధించిన రిపోర్టు యిచ్చారు. వివిధ మండల శాఖలు నివేదికపై జరిగిన చర్చలో పాల్గొన్నాయి. నివేదిక ఏకగ్రీవంగా ఆమోదింపబడింది.

రాష్ట్ర ప్రధాన కార్యదర్శి శ్రీ ఎ. వెంకట స్వామి నిర్వహించిన ఎన్నికలలో ఈ క్రింది కార్యదర్శి వర్గం ఏకగ్రీవంగా ఎన్నుకొనబడింది.

అధ్యక్షులు : శ్రీ పి. వెంకటేశ్వరరావు, అసోసియేట్ అధ్యక్షులు : శ్రీ బి.జె.సుందరరావు, ప్రధానకార్యదర్శి : శ్రీ బి. నాగేశ్వరరావు, కార్యదర్శులు : శ్రీ కె. సుబ్బారావు, శ్రీ కె. రంగరామానుజం, శ్రీ వి. రంగారావు, శ్రీ కె. వి. ప్రసాదరావు, శ్రీ యస్. మల్లిఖార్జునరావు, శ్రీ యం. డేవిడ్‌రాజు, శ్రీ బి.వి.డి.యల్. కాంతారావు, శ్రీ కె. ఆనందవిశ్వమోహన్, శ్రీ పరుచూరి వెంకటేశ్వరరావు, శ్రీ యస్. సాంబశివరావు, శ్రీ పి. రామ్‌దేవ్.

## నల్గొండ జిల్లా నూతన కౌన్సిల్

విద్యారంగం సమాజానికతీతంగా లేదనీ, విద్యారంగం ఎదుర్కొనే సమస్యలు ఆర్థిక సామాజిక సమస్యలతో ముడివడివుంటాయనీ, కాబట్టి కార్యకర్తలు సామాజిక సమస్యల్ని అనివార్యంగా అధ్యయనం చేయాలని యు.టి.యఫ్. రాష్ట్ర కార్యదర్శి శ్రీ యస్. విజయకుమార్ నల్లగొండ జిల్లా నూతన కౌన్సిల్ సమావేశంలో ప్రసంగిస్తూ చెప్పారు. నల్లగొండ జిల్లా నూతన కౌన్సిల్ సమావేశం జిల్లాశాఖ అధ్యక్షులు శ్రీ యస్. ఆంజనేయులు అధ్యక్షతన జరిగింది.

గత సంవత్సరంలో జిల్లా పరిషత్, డి.ఇ.ఓ. యల్.యఫ్ ఆఫీసులతో సాగించిన రాయబారాలు, సాధించిన ఫలితాలపై నివేదికను ప్రధాన కార్యదర్శి శ్రీ డి. ఒంప్రకాశ్ ప్రవేశపెట్టారు.

వివిధ మండలశాఖల బాధ్యులు చర్యలలో పాల్గొని విలువైన సూచనలు చేశారు. నివేదిక ఏకగ్రీవంగా ఆమోదింపబడింది.

అనంతరం యు.టి.యఫ్. రాష్ట్ర కార్యదర్శి శ్రీ యస్. విజయకుమార్ ఆధ్వర్యంలో జరిగిన ఎన్నికలలో ఈ క్రింది కార్యదర్శివర్గం ఏకగ్రీవంగా ఎన్నుకొనబడింది.

అధ్యక్షులు : శ్రీ డి. ఓంప్రకాష్, ప్రధాన కార్యదర్శి : శ్రీ పి. కృష్ణమూర్తి అసోసియేట్ అధ్యక్షులు : శ్రీ యస్. ఆంజనేయులు , కార్యదర్శులు : శ్రీ పి. సత్యనారాయణ రెడ్డి, శ్రీ యన్,బలరాం, శ్రీ జె. యాదిరెడ్డి, శ్రీ వి. అంతయ్య, శ్రీ ఆర్.రాములు, శ్రీ కె. వెంకటరెడ్డి, శ్రీ ఎ. సీతారాములు, శ్రీ యు. శాంతికుమార్, శ్రీ డి. చెన్నబసి, శ్రీ ఇ. సత్యనారాయణ, శ్రీమతి జి. ఉషాదేవి.

## ఆదిలాబాద్ నూతన కౌన్సిల్ సమావేశం

విద్యారంగం ఎదుర్కొనే సమస్యల యెడల మొత్తం సమాజం ఎదుర్కొనే సమస్యల యెడల శాస్త్రీయమైన అవగాహన కలిగించేందుకు ఉద్యమతరగతులు నిర్వహిస్తూ యు.టి.యఫ్. క్రమశిక్షణాయుతమైన కార్యకర్తలను తయారుచేసుకొనగలుగుతుందని యు.టి.యఫ్. రాష్ట్ర కార్యదర్శి శ్రీ జి. లక్ష్మయ్య ఆదిలాబాద్ నూతన కౌన్సిల్ సమావేశంలో ప్రసంగిస్తూ చెప్పారు.

జిల్లా శాఖ ప్రధాన కార్యదర్శి శ్రీ యస్. శశికాంత్ యు.ట.ఇయఫ్. కృషి నివేదికను ప్రవేశపెట్టారు. నివేదిక కౌన్సిల్ ఆమోదం పొందింది.

రాష్ట్ర కార్యదర్శి శ్రీ జి. లక్ష్మయ్య నిర్వహించిన ఎన్నికలలో ఈ క్రింది కార్యదర్శివర్గం ఏకగ్రీవంగా ఎన్నుకొనబడింది.

అధ్యక్షులు : శ్రీ కె. దేవేందర్, ప్రధానకార్యదర్శి : శ్రీ యస్. శశికాంత్

అసోసియేట్ అధ్యక్షులు : శ్రీ డి. విఠల్‌రావ్

కార్యదర్శులు : శ్రీ టి. మధుకర్, శ్రీ ఆర్.వెంకటయ్య, శ్రీ ఎ. వెంకటరమణ మూర్తి శ్రీ. వి. స్వయం ప్రకాశ్, లక్ష్మీరాజ్యం, శ్రీ పి. నారాయణ రెడ్డి, శ్రీ సి. లక్ష్మణ్ రెడ్డి, శ్రీ యస్. దయాకరరెడ్డి, శ్రీ డి. అశోక్, శ్రీ బి. సారయ్య, శ్రీ యం.కె. భట్టాచార్య.

## అధ్యయనాన్ని అలవాటుగా అభివృద్ధి చేసుకోవాలి

అధ్యయనం అధ్యాపనం సామాజిక స్పృహ సూత్రాలని, అధ్యయనాన్ని ఒక అలవాటుగా అభివృద్ధి చేసుకొన్న ఉపాధ్యాయుడు తన విద్యార్థుల చేత అధ్యాపనం చేయించుగలుగుతాడని వారిలో సామాజిక స్పృహని పెంచగలుగుతాడని యు.టి.యఫ్.మహబూబ్ నగర్ జిల్లా శాఖ నూతన కౌన్సిల్ సమావేశాన్ని ప్రారంభిస్తూ యు.టి.యఫ్. రాష్ట్ర ప్రధాన కార్యదర్శి శ్రీ ఎ. వెంకటస్వామి చెప్పారు. యు.టి.ఇయఫ్. నూతన కౌన్సిల్ సమావేశం జిల్లా శాఖ అధ్యక్షులు శ్రీ యస్.విజయకుమార్ అధ్యక్షతన జరిగింది. జిల్లాశాఖ గత సంవత్సరకాలంలో వివిధ కార్యాలయాలతో చేసిన ప్రాతినిద్యాలు ఫలితాలకు సంబంధించిన నివేదిక ప్రధాన కార్యదర్శి శ్రీ కె. రఘుపతి రెడ్డి ప్రవేశపెట్టారు. నివేదిక ఏకగ్రీవంగా ఆమోదింపబడింది.

రాష్ట్ర ప్రధాన కార్యదర్శి శ్రీ వెంకట స్వామి నిర్వహించిన ఎన్నికలలో ఈ క్రింది నూతన కార్యదర్శివర్గం ఏకగ్రీవంగా ఎన్నుకొనబడింది.

అధ్యక్షులు : శ్రీ యస్. విజయకుమార్, అసోసియేట్ అధ్యక్షులు : శ్రీ ఎ.పి. మల్లయ్య, ప్రధాన కార్యదర్శి : శ్రీ కె. రఘుపతి రెడ్డి

కార్యదర్శులు : శ్రీ యం.డి. ఖమ్రుద్దీన్, శ్రీ కె. రామదాస్, శ్రీ యం. రాములు, శ్రీ యం. ప్రకాష్ రెడ్డి, శ్రీ ఎ. కృష్ణయ్య, శ్రీ కె. హనుమంతరెడ్డి, శ్రీ యం. జనార్ధన్, శ్రీ యం. రామన్‌గౌడ్, శ్రీ యస్. కిష్టయ్య, శ్రీ యస్. భాస్కరరెడ్డి.

## విద్యారంగ ప్రైవేటీకరణను ప్రతిఘటించాలి

కేంద్ర ప్రభుత్వం అనుసరిస్తున్న నూతన ఆర్థిక పారిశ్రామిక విధానాల ప్రభావం విద్యారంగంపై ప్రసరిస్తున్నదని, విద్యారంగాన్ని ఒక క్రమపద్ధతిలో ప్రైవేటీకరణ చేసేందుకు ప్రయత్నాలు జరుగుతున్నాయని, వాటిలో భాగంగానే వివిధ ప్రచార ప్రసార సాధనాల ద్వారా ప్రైవేటు విద్యా సంస్థలపై ప్రజలకు భ్రమలు కల్పించడం జరుగుతుందని ఐక్యఉపాధ్యాయ పత్రిక ప్రధాన సంపాదకులు శ్రీ కె. కేశవరెడ్డి, యు.టి.యఫ్. కర్నూలు జిల్లా నూతన కౌన్సిల్ సమావేశాన్ని ప్రారంభిస్తూ చెప్పారు. నూతన కౌన్సిల్ సమావేశం 24-4-94 న జిల్లా శాఖ అధ్యక్షులు శ్రీ. ఎ. చెన్నకేశవరెడ్డి అధ్యక్షతన జరిగింది.

యు.టి.యఫ్. జిల్లా శాఖ కార్యదర్శి శ్రీ యం. రంగస్వామి గతసంవత్సరంలో యు.టి.యఫ్. కృషి పనివేదికను సమర్పించారు. వివిధ.మండల శాఖల బాధ్యులు కార్యదర్శి నివేదికపై జరిగిన చర్చలలో పాల్గొని విలువైన సూచనలు చేశారు. నివేదికను కౌన్సిల్ ఏకగ్రీవంగా ఆమోదించింది.

ఆ తరువాత రాష్ట్ర బాధ్యులు శ్రీ కేశవరెడ్డి నిర్వహించిన ఎన్నికలలో ఈ క్రింది కార్యదర్శివర్గం ఏకగ్రీవంగా ఎన్నుకొనబడింది.

అధ్యక్షులు : శ్రీ ఎ. చెన్నకేశవరెడ్డి , అసోసియేట్ అధ్యక్షులు : శ్రీ టి. కృష్ణయ్య, ప్రధానకార్యదర్శి : శ్రీ యం. రంగస్వామి.

కార్యదర్శి : శ్రీ యం. డేవిడ్‌రాజు, శ్రీ యం. నరసప్ప, శ్రీ జి.సి. లక్ష్మీరెడ్డి, శ్రీ ఐ. నాగరత్నం శెట్టి, శ్రీ బి. గురుస్వామి, శ్రీ యస్.నారాయణరెడ్డి, శ్రీ జె. నాగేశ్వరరెడ్డి, శ్రీ యం. ఆలపుల్ల బేగ్, శ్రీ జడ్. శ్రీనివాసయాదవ్, శ్రీ డి. హుస్సేన్, శ్రీ యస్. రవీంద్రనాధ ఠాగూర్, కుమారి యం. ఇందిరమ్మ.

రాష్ట్ర కౌన్సిలర్లు : శ్రీ ఎ. చెన్నకేశవరెడ్డి, శ్రీ యం. రంగస్వామి.

## పోరాటాల ద్వారానే ఫలితాలు

ఉపాధ్యాయులు ఈనాడు పొందుతున్న సౌకర్యాలు ప్రయోజనాలు అన్నీ కూడా పోరాటాల ద్వారా సాధించుకున్నారు గాని కొందరి ఉదారస్వభావం వలన లభించినవి కావని రాష్ట్ర యు.టి.యఫ్. ప్రధాన కార్యదర్శి శ్రీ. ఎ. వెంకట స్వామి శ్రీకాకుళం జిల్లా నూతన కౌన్సిల్ సమావేశంలో ప్రసంగిస్తూ చెప్పారు. ఆయన తన ఉపన్యాసాన్ని కొనసాగిస్తూ ఈనాడు ఉపాధ్యాయులు పొందుతున్న సౌకర్యాలు ఇంతకు ముందు తరం వారి త్యాగాల ఫలితాలని శ్రీ స్వామి వివరించారు. నూతన కౌన్సిల్ సమావేశం జిల్లా శాఖ అధ్యక్షులు శ్రీ పి. మహేశ్వరరావు అధ్యక్షతన జరిగింది.

గత సంవత్సరకాలంలో యు.టి.యఫ్. జిల్లాలో సాగించిన కృషి నివేదికను జిల్లా శాఖ ప్రధాన కార్యదర్శి శ్రీ బి. మోహన్ రావు ప్రవేశపెట్టారు. నివేదిక కౌన్సిల్ ఆమోదం పొందింది.

రాష్ట్ర ప్రధాన కార్యదర్శి శ్రీ ఎ. వెంకటస్వామి ఎన్నికలు నిర్వహించారు. ఈ క్రింది కార్యదర్శివర్గం ఏకగ్రీవంగా ఎన్నుకొనబడింది.

అధ్యక్షులు : శ్రీ పి. మహేశ్వరరావు, అసోసియేట్ అధ్యక్షులు : శ్రీమతి కె. రామలక్ష్మి, ప్రధాన కార్యదర్శి : శ్రీ బి. మోహనరావు

కార్యదర్శులు : శ్రీ పి. కృష్ణమూర్తి, శ్రీ యస్. జానకిరామయ్య, శ్రీ జి. అప్పారావు, శ్రీ యస్. అప్పలరాజు, శ్రీ వి.వి. వసంతకుమార్, శ్రీ బి.వి. సూర్యనారాయణ, శ్రీ జె. నీలయ్య, శ్రీ యం. సన్యాసినాయుడు, శ్రీ బగాది. వెంకటరావు.

## కర్తవ్య నిర్వహణలో నిబద్ధత

-యు.టి.యఫ్. విధానం

నిబద్ధతతో పనిచేయడమే గాక కార్యకర్త నలుగురికి సహకరిస్తూ నలుగురి సహకారాన్ని అందుకుంటూ ముందుకు పోవాలని, కార్యకర్తల మధ్య సరియైన సమన్వయం సహకారం వుండడం వలననే యు.టి.యఫ్. రాష్ట్రంలో అత్యంత పెద్ద ఉపాధ్యాయ సంఘంగా ఎదిగిందని, దానిని యింకా అభివృద్ధి పరచవలసిన బాధ్యత ముఖ్యంగా యువకార్యకర్తల పైన వున్నదని యు.టి.యఫ్. రాష్ట్ర కార్యదర్శి శ్రీ యస్.ఆర్.పోలిశెట్టి, విశాఖ జిల్లాశాఖ నూతన కౌన్సిల్ సమావేశంలో ప్రసంగిస్తూ చెప్పారు. జిల్లా కౌన్సిల్ సమావేశం జిల్లా శాఖ అధ్యక్షులు శ్రీ బి. ఈశ్వరరావు

అధ్యక్షతన జరిగింది. ప్రధాన కార్యదర్శి జిల్లా శాఖ కృషి నివేదికను ప్రవేశపెట్టారు. నివేదిక ఆమోదింపబడింది. యు.టి.యఫ్. రాష్ట్ర ప్రధాన కార్యదర్శి శ్రీ ఎ. వెంకటస్వామి ఉద్యమచరిత్రను, ఈనాడు విద్యారంగం ఎదుర్కొంటున్న సవాళ్లను సంక్షిప్తంగా వివరించారు.

ఆ తరువాత రాష్ట్ర కార్యదర్శి శ్రీ యస్. ఆర్. పోలిశెట్టి ఆధ్వర్యంలో జరిగిన ఎన్నికలలో ఈ క్రింది కార్యదర్శివర్గం ఏకగ్రీవంగా ఎన్నుకొనబడింది.

అధ్యక్షులు : శ్రీ బి. ఈశ్వరరావు, ప్రధానకార్యదర్శి : శ్రీ కె. యస్.యస్. శాస్త్రి, అసోసియేట్ అధ్యక్షులు : శ్రీ జి. కోదండరామస్వామి

కార్యదర్శులు : శ్రీ హెచ్. అచ్యుతరామయ్య, శ్రీ .యస్. దొరయ్య, శ్రీ యం. ఏసుపాదం, శ్రీ జి. జగన్నాథం, శ్రీ కె. ఎడ్వర్డ్, శ్రీ ఎ. గౌరీశ్వరరావు, శ్రీమతి ఎ. ప్రభావతి.

## యు.టి.యఫ్. రంగారెడ్డి జిల్లా నూతన కౌన్సిల్ డిమాండ్

రాష్ట్రం అంతటా సంవత్సరాల తరబడి వేలకొలది ఉపాధ్యాయపోస్టులను ఖాళీగా వుంచి ఫలితాలు ప్రమాణాలు పడిపోవడానికి ఉపాధ్యాయులే కారణమని ప్రభుత్వం చేస్తున్న దుష్ప్రచారాన్ని ఆంధ్రప్రదేశ్ ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ రంగారెడ్డి జిల్లా శాఖ నూతన కౌన్సిల్ ఖండించింది. కావాలని ఒక పథకం ప్రకారం ప్రైవేటు పాఠశాలల్ని పొగడుతూ స్థానిక సంస్థల, మునిసిపల్, ప్రభుత్వపాఠశాలలను కనీస మౌలిక సదుపాయాలు కల్పించకుండా ప్రజలకు ప్రైవేటు పాఠశాలలపై మోజుపెంచే ప్రయత్నం చేస్తున్నదని, ప్రభుత్వం ఈ ధోరణి విడనాడి ఖాళీగా నున్న ఉపాధ్యాయపోస్టులన్నింటిని నిపాలని కౌన్సిల్ డిమాండ్ చేసింది.

24-4-94న జిల్లా ప్రజాపరిషత్ బాలికల ఉన్నతపాఠశాల బొల్లారంలో నూతన కౌన్సిల్ సమావేశం శ్రీ టి. శంకరరెడ్డి అధ్యక్షతన జరిగింది. శ్రీ యం. కరుణాకరరెడ్డి సంతాప తీర్మానాలను ప్రవేశపెట్టారు. తరువాత ప్రధాన కార్యదర్శి శ్రీ వి. మాణిక్‌రెడ్డి గత సంవత్సర కాలంలో నిర్మాణపరంగాను ఉద్యమపరంగాను సాగించిన కృషినివేదిక సమర్పించారు. నివేదికపై చర్చల్లో పాల్గొన్న ప్రతినిధులు సంఘపురోభివృద్ధికై పలుసూచనలు చేస్తూ వివిధకార్యాలయాల్లో పెరిగి పోతున్న అవినీతిని నిశితంగా విమర్శించారు. నివేదికను కౌన్సిల్ ఏకగ్రీవంగా ఆమోదించింది.

రాజకీయదీక్షలేనిదే ఏనివేదిక అయినా గ్రంథాలయాలకే పరిమితమవుతుందనీ, అన్నిరకాల ప్రయోగాల ఫలితాలు సామాన్యునికి అందజేయాలనే నిబద్ధత కొరవడినప్పుడు సత్ఫలితాలు సాధ్యపడవనీ దృశ్యశ్రవణ విద్యావికాసకేంద్రం డైరెక్టరు శ్రీ జి.వి. సుబ్బారావు భారంలేకుండా చదువు అనే అంశంపై ప్రసంగిస్తూచెప్పారు. ప్రత్యేక ఆహ్వానితులుగా విచ్చేసిన మేడ్చల్ మండల ప్రజాపరిషత్ మాజీ అధ్యక్షులు శ్రీ శ్రీనారెడ్డి నందారెడ్డి సందేశమిస్తూ, సమాజిక సమస్యలపై గోష్ఠులు నిర్వహిస్తున్న యు.టి.యఫ్. కార్యకలాపాలను అభినందించారు.

మధ్యాహ్నం జరిగిన సమావేశంలో యు.టి.యఫ్. రాష్ట్ర అధ్యక్షులు శ్రీ డి. రామిరెడ్డి సందేశం యిస్తూ యు.టి.యఫ్. సభ్యత్వం,పత్రిక, అధ్యాపకదర్శినుల ప్రచురణ వంటి విషయాలను సవాలుగా తీసికొని పనిచేస్తున్నతీరును వివరించారు. ఉపాధ్యాయులు ప్రస్తుతం పొందుతున్న సౌకర్యాలతో తృప్తిపడి ఉద్యమాల యెడల ఉదాశీనవైఖరి నవలంబిస్తే రానున్న కాలంలో ఉద్యోగభద్రత, సెలవుసౌకర్యం, పెన్షన్ వంటి వాటిని కోల్పోయే ప్రమాదం వుందని, వీటిని సంరక్షించుకోవాలంటే ప్రజలసహకారంతో యితరప్రజా సంఘాలతో కలిసిపోరాడవలసిన అవసరం ఏర్పడవచ్చునన్నారు. హక్కుల రక్షణకోసం జైళ్లకెళ్లిన తమిళనాడు ఉపాధ్యాయులను ఆదర్శంగా తీసికోవాలని రామిరెడ్డి కోరారు. సబన జిల్లాశాఖ అసోసియేట్ అధ్యక్షులు శ్రీ మార్కు అధ్యక్షతవహించారు.

ప్రఖ్యాత పర్యావరణ శాస్త్రజ్ఞులు డాక్టర్ కె. పురుషోత్తం రెడ్డి 'మారుతున్న పర్యావరణ పరిస్థితులు - పర్యావరణ విద్య' అనే అంశంపై చాలా విజ్ఞానదాయకమైన ప్రసంగం చేశారు. యు.టి. యఫ్. రాష్ట్రకార్యదర్శి శ్రీ మోతుకూరి నరహరి 'జాతీయ సమైక్యత - ఉపాధ్యాయుల పాత్ర అనే అంశంపై ఉపాధ్యాయుల్ని కదిలించి కర్తవ్యోన్ముఖుల్ని చేసే ప్రసంగం చేశారు. పంచాయితీ రాజ్ ఉపాధ్యాయ సంఘనాయకులు శ్రీ ముకుందరెడ్డి కౌన్సిల్‌కు శుభాకాంక్షలు తెలిపారు. చిరంజీవులు శ్యామల, శారద "చదువంటే మూడోకన్ను, నరజాతి' మనుగడకు ఆధారం చెట్లు లాంటి సందర్భోచితమైనగేయాలను ఆలాపించారు. రాష్ట్ర యు.టి.యఫ్ కార్యదర్శి శ్రీ యం. నరహరి నిర్వహించిన ఎన్నికలలో ఈ క్రింది కార్యదర్శివర్గం ఏకగ్రీవంగా ఎన్నుకొనబడింది.

అధ్యక్షులు: శ్రీటి. శంకరరెడ్డి, ప్రధాన కార్యదర్శి: శ్రీ.పి.మాణిక్‌రెడ్డి

కార్యదర్శులు: శ్రీ యం. అంజయ్య, శ్రీ కె. ప్రభాకరరెడ్డి, శ్రీ కె. లింగప్ప, శ్రీ ఆర్. నరసంహాచారి, శ్రీ డి. మల్లారెడ్డి, శ్రీమతి జి. సురేఖ, శ్రీ కె. లోహిత్‌రెడ్డి

# ఎయిడెడ్, మునిసిపల్ ఉపాధ్యాయుల జీతాలు సక్రమంగా చెల్లించాలి.

## గుంటూరు జిల్లా నూతన కౌన్సిల్ డిమాండ్

దీర్ఘకాలంగా ఉపాధ్యాయుల రిక్రూట్‌మెంట్ లేనందున రాష్ట్రవ్యాప్తంగా గల పాఠశాలల్లో వేలాది ఉపాధ్యాయపోస్టులు ఖాళీగా వున్నాయి. అందువలన విద్యాభివృద్ధి కుంటుబడుతున్నది. కాబట్టి ఉపాధ్యాయుల రిక్రూట్‌మెంటుకి తక్షణచర్యలు గైకొని విద్యాసంవత్సరం ప్రారంభంలోనే ఖాళీ పోస్టుల్ని నింపాలని ప్రభుత్వాన్ని కోరుతూ గుంటూరుజిల్లా యు.టి.యఫ్. 21వ నూతన కౌన్సిల్ తీర్మానించింది.

4-6-94 శనివారం గుంటూరు జిల్లా యు.టి.యఫ్. 21వ నూతన కౌన్సిల్ సమావేశం శ్రీయం. రామన్న అధ్యక్షతన గుంటూరులోని మైనేని ఉపాధ్యాయభవన్‌లో జరిగింది. గత సంవత్సరకాలంలో వివిధరంగాలలో ఉపాధ్యాయుల సమస్యలపైన జిల్లా ప్రజాపరిషత్ మండల ప్రజాపరిషత్‌లలో పి.ఆర్.సి. స్కేల్సు అమలు సందర్భంగా అవినీతి, అక్రమాలు, వివక్షతలకు వ్యతిరేకంగా యు.టి.యఫ్. జిల్లాశాఖ కృషినివేదికను ఆర్థికనివేదికను జిల్లాశాఖ ప్రధానకార్యదర్శి శ్రీకె. జోజయ్య ప్రవేశపెట్టారు. పలువురు చర్చలలో పాల్గొని విలువైన సూచనలు చేశారు. నివేదిక ఏకగ్రీవంగా ఆమోదింపబడింది.

జిల్లా ప్రజాపరిషత్, మండల ప్రజాపరిషత్, డి.ఇ.ఓ. మునిసిపల్ కార్యాలయాలలో అపరిష్కృతంగా వున్న 40 వివిధ సమస్యలపై కార్యదర్శి శ్రీటి శ్రీనివాసరావు ప్రవేశపెట్టారు. కౌన్సిల్ తీర్మానాలను ఆమోదించింది.

విద్యను ప్రైవేటీకరణ చేయరాదని, విద్యాసంస్థలను గ్రామకమిటీలపేరుతో పెత్తందార్లకి అప్పగించరాదని, ఎయిడెడ్ మునిసిపల్ ఉపాధ్యాయుల జీతాల మరియు పి.ఆర్.సి బకాయిల బడ్జెటుని వెంటనే విడుదల చేయాలని, ప్రభుత్వంతో కుదిరిన ఒప్పందాలపై వెంటనే ఉత్తర్వులు ఇవ్వాలని, జిల్లా ఉపాధ్యాయసంఘాల యాక్షన్ కమిటీకి 8-4-94న 15-4-94న జిల్లా ప్రజాపరిషత్ అధికారులు యిచ్చిన హామీలను అమలుజరపాలని తదితర 40 సమస్యలపై కౌన్సిల్ తీర్మానాలను ఆమోదించింది.

ఆతరువాత జిల్లాశాఖ నూతన కార్యదర్శివర్గ ఎన్నికలను రాష్ట్రప్రధానకార్యదర్శి శ్రీవి. వెంకటస్వామి నిర్వహించారు. ఈ క్రింది కార్యదర్శివర్గం మరియు రాష్ట్రకౌన్సిల్ ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు.

అధ్యక్షులు శ్రీవి. విశ్వనాథం అసోసియేట్ అధ్యక్షులుః శ్రీయం. ఎ. కె. దత్ ప్రధాన కార్యదర్శి శ్రీ కె. జోజయ్య

కార్యదర్శులు. శ్రీటి. అంజరెడ్డి, శ్రీయం. రాయన్న, శ్రీకె. నారాయణరావు శ్రీజి. కోటేశ్వరరావు, శ్రీవై. నాగేశ్వరరావు, శ్రీబి. రాజగోపాలరావు శ్రీవి. వెంకటేశ్వర్లు, శ్రీపి. నాగిరెడ్డి, శ్రీయస్. కోటేశ్వరరావు శ్రీ కె.యస్.వి. దుర్గారావు, శ్రీ ఆర్. ఆంజనేయులు

రాష్ట్రకౌన్సిలర్లుః శ్రీయు. రాయన్న, శ్రీయం.యం. కాంతారావు శ్రీయం వి. సీతారామయ్య, శ్రీ సిహెచ్.వీరబ్రహ్మం, శ్రీజి. సుబ్బారావు శ్రీవి. నాగేశ్వరరావు, శ్రీమతి జి. [illegible], శ్రీపి కోటయ్య

## యు.టి.యఫ్. ఒంగోలు కార్యాలయంలో మీటింగుహాలు ప్రారంభోత్సవం

ఒంగోలులోని యు.టి.యఫ్. కార్యాలయంపై మీటింగుహాలు నిర్మాణానికి తోడ్పడిన ఉద్యమకార్యకర్తలను ఉపాధ్యాయులను అభినందిస్తూ, విద్యారంగం ప్రస్తుతం ఎదుర్కొంటున్న క్లిష్టపరిస్థితుల దృష్ట్యా కార్యకర్తలు ఉద్యమాల పటిష్టతకు అంకితభావంతో పనిచేయవలసిన ఆవశ్యకత కలదని మీటింగుహాలుకు ప్రారంభిస్తూ యు.టి.యఫ్. రాష్ట్రఅధ్యక్షులు శ్రీడి. రామిరెడ్డి చెప్పారు. 15.5.94న ఆయన కొత్తగా నిర్మింపబడిన మీటింగుహాలును ప్రారంభించారు.

ఈ సందర్భంలో జరిగిన సభకు యు.టి.యఫ్. రాష్ట్ర ప్రధాన కార్యదర్శి శ్రీవి. వెంకటస్వామి అధ్యక్షత వహించారు. శ్రీవెంకటస్వామి ప్రసంగిస్తూ యు.టి.యఫ్. సూత్రబద్ధవైఖరితో ఉపాధ్యాయుల సంక్షేమంకొరకు పోరాడుతూ పురోగమిస్తున్న సంస్థయని, ఆ పురోగమనంలో భాగంగానే వివిధ జిల్లాలలో కార్యాలయాలనేర్పాటుచేసుకుంటోందని, ఆకార్యాలయాలు విద్యాసంస్కృతులను విస్తరింపచేసే కేంద్రాలుగా అభివృద్ధిచెందుతున్నాయని చెప్పారు. ఉద్యమ అవసరాల రీత్యా రాష్ట్రరాజధానియైన హైదరాబాద్‌లోని యు.టి.యఫ్. కార్యాలయాన్ని పెంచడం అవసరమని అందుకు ఉపాధ్యాయులందరు సహకరించవలసిందిగా ఆయన విజ్ఞప్తిచేశారు.

కేవలం ఉపాధ్యాయులకే పరిమితంగాక యు టి.యఫ్. నిర్మించే భవనాలు వివిధ ప్రజాసంఘాల కార్యకలాపాలకు సహకరించగలమన్న ఆశాభావన్ని శ్రీవై. సిద్ధయ్య, శ్రీవి.వి.పూర్ణారావు వ్యక్తంచేశారుః యు.టి.యఫ్. కర్నూలు జిల్లాశాఖ ప్రధానకార్యదర్శి శ్రీయం.రంగస్వామి, నెల్లూరు జిల్లాశాఖ అధ్యక్షులు శ్రీటి. కొండాచారి సందేశాలు యిచ్చారు. ప్రకాశం జిల్లాశాఖ అధ్యక్షులు శ్రీకె. ఆదినారాయణ వందన సమర్పణచేశారు.

## కుటుంబ సంక్షేమ పథకం ప్రారంభం

ఉపాధ్యాయుల జీతభత్యాలు వారిపని పరిస్థితుల మెరుగుదలకొరకు కృషిచేయడమేగాక చనిపోయిన ఉపాధ్యాయుల కుటుంబాలను ఆదుకొనేందుకు కుటుంబసంక్షేమ పథకాన్ని ప్రవేశపెడుతున్నందులకు ఒంగోలు పార్లమెంటు సభ్యులు శ్రీ మాగుంటసుబ్బరామిరెడ్డి యు.టి.యఫ్.ని అభినందించారు. ఆయన 15-5-94న యు.టి.యఫ్ అధ్వర్యంలో నిర్వహింపబడుతున్న కుటుంబసంక్షేమపథకాన్ని పారంభించారు. నీలం సుబ్బయ్యగారి కుటుంబానికి చెక్కును అందచేశారు. ఈ పథకానికి 25వేల రూపాయల విరాళం ప్రకటించారు.

ఈ పథకాన్ని చేపట్టినందుకు యు.టి యఫ్.ని అభినందిస్తూ ఒంగోలు శాసనసభ్యులుశ్రీబచ్చలబాలయ్య11వేలవిరాళాన్ని సంత నూతలపాడు

